

అంతర్జాతీయ తెలుగు సచిత్ర మాసపత్రిక


సంపాదకవర్గం
సంపాదకుడు:

లయన్ కె.వి.గోవిందరావు బి.ఏ.,ఎల్.ఎల్.బి.,

గౌరవ సహాయ సంపాదకులు:
టి.ఎల్.ఎన్.రావు బి.ఎస్సి.,
వి.బాలకుమార్ ఎమ్.ఏ.,బి.ఎల్.,

సభ్యులు:
కె.వి.ఎస్.శరత్‌బాబు బి.ఏ.,బి.కాం.,బి.ఎల్.,
కె.వి.ఎస్.విజయకుమార్ బి.కాం.,
కె.రత్నకుమారి

చందా వివరాలు

శాశ్వత చందా........... రూ.400/-
3 సంవత్సరాల చందా..... రూ.100/-
సంవత్సర చందా.......... రూ.36/-
ఎయిర్ మెయిల్ (1 సం.)... రూ.130/-
సీ మెయిల్ (1 సం.)........ రూ.75/-

చందా పంపవలసిన చిరునామా

రత్నా ఏజన్సీస్

8, దేశికా రోడ్, మైలాపూర్, మద్రాస్-600004.
ఫోన్: 73327


ఈ సంచికలో

మార్చి 1990



ముఖచిత్రం:
కలర్ ట్రాన్స్‌పరెన్సీ
ఎ.వి.భాస్కర్

తెలుగు విస్‌డమ్‌కు ఇది తొలి ద్వితీయ వత్సరం

## ధ్యానం

# ఔదార్యం అలవరచుకో




మనస్సులో ఎన్ని భావాలు! ఎన్ని వికారాలు! ఎన్ని ఆవేశాలు! అత్యాశ, లుబ్ధత, అసూయ, ఈర్ష్య ఓర్వలేని తనము, అనుమానాలు వంటి దుర్గుణాలు మనస్సులో పాతుకుపోయి ప్రవృద్ధి చెందుతూంటే జీవితంలో మంచి అనేదంతా పూర్తిగా నశించిపోతుంది. కష్టాలపాలై పోతావు సుఖసంతోషాలుండవు. విశాలహృదయంతో ఔదార్యంగా ఉదారబుద్ధిని అలవరచుకో. ఆత్మవిశ్వాసం అభివృద్ధి చేసుకో. ధారాళ బుద్ధితో ఉండటం నేర్చుకో. నీ ఇరుగు పొరుగువారు వారి స్వాతంత్ర్యాన్ని అనుభవించనీ. పవిత్రమైన ఆశయాలతో ధృఢమైన చిత్తంలో ఆనందం అంకురిస్తుంది పరిశుద్ధమైన ఊహలవల్ల నీవు పరిశుద్ధుడవు అవుతావు. ముఖం చూస్తే చాలు- మనసులో ఉన్నది తెలిసిపోతుంది

(మిగతా 3 వ పేజీలో)

## సంపాదకుని పేజీ

# వివేకమే నేర్పు

జీవితరంగంలో విజయం సాధించాలంటే వివేకం ఉండి తీరాలి సామాన్య పరిజ్ఞానమే వివేకం నిత్యజీవితంలో విజయం సాధించడానికి తెలివి తేటలా లేక నేర్పా ముఖ్యావసరం అనే ప్రశ్నలు వేసే పెద్ద మనుషులు సామాన్యంగా చాలామంది ఉంటారు. మనిషిగా పుట్టిన ప్రతీ ప్రాణికి జ్ఞానం ఉండకమానదు. కానీ వివేకం, చాతుర్యం, నేర్పు లేకుండా ఏ పనీ సక్రమంగా నెరవేరదు

జీవిత పోరాటంలో తెలివి అనే జ్ఞానశక్తి అపూర్వమనే విషయం నిజమే కానీ వివేకం వల్ల నేర్పు, సామర్థ్యం అలవడుతుంది నేర్పు వల్లే శక్తికి కళ్లెంవేసి నియంత్రించగలుగుతాము. ఒక కిలోగ్రాము జ్ఞానం సార్థకంగా వినియోగించుకోడానికి 10 కి గ్రా ల సామర్థ్యం అవసరం

బుద్ధి బలాలలో సామర్థ్యబలం తలమానికం అని చెప్పుకోక తప్పదు ఒక పనిని ధర్మబద్ధంగా నిర్వహించడమే కాదు. అటువంటి పనిని యుక్తమైన చోట సకాలంలో సక్రమంగా నిర్వహించాలి

ఏంచేయాలో జ్ఞానంవల్ల తెలుస్తుంది. ఎప్పుడు, ఎలా చేయాలో వివేకంవల్ల తెలుస్తుంది. ఉన్నదానిని ఉన్నట్టుగా చూడడం, చేయవలసిన పనిని చేయవలసిన విధానంలో సక్రమంగా చేయడం సామర్థ్యం అనిపించుకుంటుంది. అదే వివేకం, నేర్పు. సకాలంలో నేర్పుతో నిర్వహించే వ్యక్తి వివేకమే ఉత్తమోత్తమమైన వివేకం!

"అతికష్టమైన పని 'నిన్ను నీవు తెలుసుకోవటం',
అతి తేలికైన పని 'ఇతరులకు సలహాలివ్వటం'!"
— లెరిటస్

వివేక శూన్యమైన చదువు నిరర్థకం నిత్య జీవితంలో అట్టివారు అసమర్థులు. పెద్దపెద్ద ఉద్గ్రంధ పరనంవల్ల మనం అధికంగా పొందే



లాభం ఏమీ ఉండదు విజయసాధనకు అనుభవంతో కూడిన వివేకం ఉండాలి. ప్రతీభావాన్ని విచక్షణా బుద్ధితో పరిశీలించగల అనుభవజ్ఞులు ఈనాడు ఎంతో అవసరం.

## కళ్ళ జబ్బులకు మెడికేటెడ్ పోలిమెర్ ఫిల్మ్

సోవియెట్ యూనియన్ మాస్కోలో శాస్త్రజ్ఞులు కంటిరోగాలను కుదర్చడానికి ఒక క్రొత్త విధానాన్ని అభివృద్ధి చేసారు. అండాకారంలో ఔషధగుణం కలిగిన పోలిమెర్ ఫిల్మును ప్రతీరోజూ ఉదయం రోగి కంటికి పెడతారు. కొద్ది సెకండ్లలోనే ఇది బాగా వంచడానికి వీలుగా మెత్తబడి పోతుంది. పూర్తిగా పారదర్శకంగా ఉంటుంది. కంటిలో ఉన్నా ఉన్నట్టు అనిపించదు. కొంతకాలంపాటు ఈ ప్లాస్టిక్ మెల్లిమెల్లిగా కరుగుతూ రోగనివారక ఔషధాన్ని వదులుతూ ఉంటుంది. ఇటువంటి ఫిల్ములు గ్లూకోమా, ట్రాకోమా మొదలైన వాటికి మరియు చెడిపోయిన కార్నియా, నరాల బలహీనతకు కూడా ఉపయోగ పడతాయి. ఈ ఫిల్ములను ఏళ్లకొద్ది స్టోరు చేసుకోవచ్చు

## పరస్పరాశ్రయం లేకుండా బ్రతుకలేరు

చెట్టుపై ఆకుని అడగండి: 'నీ అంతట నీవు ఇంకొకరి ఆశ్రయం లేకుండా ఉన్నావా?' లేదు. 'నా జీవితం అంతా కొమ్మలపై ఆధారపడి ఉంది' అంటుంది ఆకు ఆకొమ్మని అదేప్రశ్న వేయండి 'లేదు నా జీవితం చెట్టు కాండంపై ఆధారపడి ఉంది' అంటుంది కాండాన్ని అడగండి ఆప్రశ్న. 'లేదు నాజీవితం వ్రేళ్లను ఆధారం చేసుకుని ఉంది' అంటుంది. వ్రేళ్లను పట్టుకోండి - సత్యంచెబుతుంది. 'నాజీవితం పూర్తిగా కాండంమీద, కొమ్మలమీద, ఆకులమీద ఆధారపడి ఉంది వీటిలో ఏ ఒక్కటి లేకపోయినా నేను నశించిపోతాను' అంటుంది. అలాగే మానవ వృక్ష జీవితం ప్రతీ దేశంలోను, సంఘంలోను, కుటుంబంలోను ఇదేసత్యం. ఏఒక్క ప్రత్యేక వ్యక్తి ఎవరికివారే పరిపూర్ణులుకారు. ఒకరు లేకుండా ఇంకొకరు జీవించలేరు పరస్పరాశ్రయం లేకుండా ప్రవృద్ధి పొందలేరు, విజయం సాధించలేరు

( 2 వ పేజీ తరువాయి)

మనసు నిర్మలంగా, శాంతంగా ఉంచుకో నీవు తేజోవంతుడవు అయిపోతావు అహంకార మమకారాలు నశించి హృదయం నిర్మలమైతే సత్యం ప్రకాశిస్తుంది. స్నేహితులను, అతిధులను ఆహ్వానిస్తావు. సుఖ సౌభాగ్యాలతో తులతూగుతావు. బుద్ధిని నిరామయం చేసుకుంటే నీకంతా శాంతే. వినయ సౌశీల్యాలతో కూడిన ఉత్సాహశక్తి వల్ల సాధన సఫల మవుతుంది.

"నలభైకే నిరాశతో, నిస్పృహతో క్రుంగిపోయే వారికంటే
డెబ్బై దాటినా భవిష్యత్తులోకి ఉత్సాహంతోను,
ఆశాపూరితంగానూ చూసేవారు మెరుగు." —హ్యూమ్స్

# నేషనల్ మ్యూజియంలు

స్వాతంత్ర్యం సిద్ధించిన తరువాత 1947లో నేషనల్ మ్యూజియం (జాతీయ పురావస్తుశాల) లను స్థాపించారు. ఇప్పుడు దేశంలో మొత్తం మూడు నేషనల్ మ్యూజియంలు నిర్వహింపబడుతున్నాయి.



1948లో న్యూఢిల్లీలో స్థాపింపబడిన నేషనల్ మ్యూజియం ముఖ్యంగా దృశ్య-శ్రవణ విద్యావిధానానికి ఎక్కువగా తోడ్పడుతుంది. వస్తువులను సేకరించుట, ప్రదర్శించుట, భద్రపరచుట, ప్రచురించుట మరియు విద్య నేర్పుట దీని ముఖ్య కార్యక్రమము. హరప్పా, మొహెంజొదారో నుండి గ్రహింపబడిన అపూర్వ వస్తువులు ఇక్కడ ఉన్నాయి. నుంచుని ఉన్న బుద్ధవిగ్రహం, స్నానం చేస్తున్న స్త్రీ, కర్ణాటకాలో అయ్‌హోల్ నుంచి తీసుకు వచ్చిన విద్యాధర దంపతులు వంటి అపూర్వ మైన శిల్పాలు కొన్ని ఇక్కడ ఉన్నాయి. రక రకాల బట్టలు, పర్షియన్ మరియు అరబిక్ లిఖిత గ్రంధాలు, అహిచాత్రనుండి తీసుకు వచ్చిన గంగాయమునా బొమ్మలు, భారతదేశపు కుడ్య శిల్పాలు ఇక్కడ భద్రపరచబడ్డాయి.

ఇండస్ నాగరికతకు చెందిన మొహెంజొదారో నుంచి తెచ్చిన నృత్యంచేస్తూన్న కంచు విగ్రహం ఇక్కడ ప్రదర్శింపబడుతూంది. రాజపుట్ మరియు పహరీ పెయింటింగులు, సుప్రసిద్ధ మైన మధ్య ఆసియా దేశపు కుడ్య చిత్రాలు మ్యూజియంలో చాలా ఉన్నాయి. ఇక్కడ ఉన్న

## ప్రకృతిసిద్ధమైన కీటక నాశినులు

అభివృద్ధి చెందుతున్న దేశాలలో ప్రకృతిసిద్ధ మైన కీటక నాశినుల వాడకం చీడల సమస్యకు ఒక సాధనంగా కనిపిస్తుంది. ఆధునిక కీటకనాశిని మందులలో చాలా అమోఘంగాను, శీఘ్రంగాను పనిచేసే పైరిత్రిన్ (Pyrethrin) ప్రకృతిసిద్ధంగా లభిస్తుంది. ఇది ఆఫ్రికాలో సమృద్ధిగా పెరిగే చామంతి పూవులనుండి ఉత్పత్తి చేయబడు తుంది. ఇది అతిశీఘ్రంగా పాడైపోతుంది కావున కృత్రిమ కీటకనాశిని మందులలాగా చాలాకాలం ఉండదు.

ఫిలిప్పైన్స్ [illegible] వేప [illegible] 123 రకాల [illegible] తెలుసుకున్నారు.

అభివృద్ధి చెందుతున్న దేశాలలో [illegible] ఉపయోగిస్తున్నారు.

— [illegible]

"మనం కొండంత సలహానిస్తాం కానీ, తీసుకునేది అవగింజంతే!" —అల్జర్

చోళులకాలంనాటి కంచు విగ్రహాలలో నటరాజ విగ్రహం అందాలు చిందుతూంటుంది.

కలకత్తాలో ఇండియన్ మ్యూజియం దేశంలో మొట్టమొదటి మ్యూజియం. ఇది 1814లో స్థాపింపబడింది. భారతదేశం అంతటా అనేకచోట్ల లభించిన రాతియుగపు పనిముట్లు, హరప్ప, మొహెంజొదారో త్రవ్వకాలలో లభించిన పనిముట్లు ఇక్కడఉన్నాయి. ఖజురాహో కళ మరియు బెంగాల్ పాల శిల్పకళ ఇక్కడ ప్రదర్శింపబడతాయి వివిధ భారతీయ నాణాలు భద్రపరచబడిన ప్రపంచపు మ్యూజియంలలో ఇది ఒక్కటి.



హైదరాబాద్ సాలార్‌జంగ్ మ్యూజియంలో ప్రపంచంలో వివిధ ప్రదేశాలకు చెందిన వింత వస్తువులు ఎన్నో ఉన్నాయి. ప్రసిద్ధికెక్కిన హైదరాబాద్ సాలార్‌జంగ్ కుటుంబానికి చెందిన చివరి నవాబు మీర్‌యూసఫ్ అలీఖాన్ వీటిని సేకరించాడు. ఇదొక్కటే భారతదేశంలో మధ్య మరియు అధునాతన యుగపు కళాఖండాలు, వస్తువులు ఉన్న బ్రహ్మాండమైన మ్యూజియం. ఈమ్యూజియంలో 7500 పర్షియన్, అరబిక్, ఉర్దూ లిఖిత గ్రంథాలు ఉన్నాయి. తేజోవంతంగా ప్రకాశించే ఖురాన్ ఒకటి ఉంది. ఇక్కడి అనేక రకాల ఆట సామగ్రి, బొమ్మల సేకరణ చాలా ముఖ్యమైనవి. మొగలాయి చక్రవర్తులు ఉపయోగించిన పెద్దపెద్ద బాకులు, పట్టా కత్తులు (ఖడ్గము), బల్లెములు మొదలైన వాటిలో వజ్రాలు మరియు కెంపులు పొదిగిన నూర్జహాన్ బాకు చూడదగినది. 14వ లూయీ మరియు 15వ లూయీ చక్రవర్తులు ఉపయోగించిన అందమైన నగిషీలతో కుర్చీలు, బల్లలు కూడా ఇక్కడ చోటు చేసుకున్నాయి.

## ధన్యవాదాలు చెప్పడానికి లుబ్ధత్వం వద్దు

ఒక కార్యం ఎంత నైపుణ్యంగా ముగించినా కొందరు అసలు మెచ్చుకోరు. ఏదో అమూల్యమైన మహాభాగ్యం పోతుందని భ్రాంతి పడతారు. ఎవరినైనా నిందించాలంటే, విమర్శించాలంటే ఎంతో ఉత్సాహంతో ఆరంభిస్తారు. ఒకరు చేసే పనిని అభినందించాలంటే ఔదార్యం, ఉదారత, విశాలహృదయం ఉండాలి.

—ఎమ్.ఎ.వార్డ్

## రోల్స్‌రాయిస్ ఏరో-ఇంజన్‌లను 12,000 సివిల్ మరియు మిలటరీ విమానాలకు అమర్చారు

*ప్రపంచంలో 12,000 సివిల్ మరియు మిలటరీ విమానాలకు బ్రిటన్‌లో తయారయే రోల్స్‌రాయిస్ ఏరో ఇంజన్‌లను అమర్చారు. వీరిమొత్తం వ్యాపారంలో సగానికిపైగా మిలటరీ ఎయిర్‌క్రాఫ్ట్ ఇంజనుల వ్యాపారం!*

*వీరి ఇంజనులు 80 వివిధరకాల విమానాలకు అమర్చారు. ఈ ఇంజనులు అమర్చిన విమానాలను 110 ఎయిర్‌ఫోర్సులు, 270 ఎయిర్‌లైన్స్, 700 కార్పొరేట్ మరియు ఎగ్జిక్యూటివ్ ఆపరేటర్లు నడుపుతున్నారు*

"కార్యనిర్వహణలోనే కవితాగానం ఉంది."

—షేక్స్పియర్

# మీ విజ్ఞానం పరీక్షించుకోండి

## క్విజ్

1 ఆంగ్లంలో 'బుల్స్ అండ్ బేర్స్' అనే పదం దీనికి సంబంధించినది.
(ఎ) దిగుమతులు మరియు ఎగుమతులు, (బి) బాంకింగ్, (సి) కమ్యూనికేషనులు, (డి) స్టాక్ మార్కెట్.



2. లలిత్ కళా ఎకాడమీకి దీనితో సంబంధం ఉంది:
(ఎ) నాట్యము, (బి) పెయింటింగ్, శిల్పము, కళలు మరియు ఆర్కిటెక్చర్ వగైరా, (సి) సంగీతము, (డి) ఇవిఏవీకావు.

3 శ్రీనివాస రామానుజం పేరు దీనికి సంబంధించి ఉంది
(ఎ) థియరీ ఆఫ్ రెలిటివిటీ, (బి) థియరీ ఆఫ్ నంబర్స్, (సి) థియరీ ఆఫ్ ప్రోబబిలిటీ, (డి) రామన్ ఎఫెక్ట్

4 1988వ సంవత్సరంలో ఇండియన్ ఫిల్మ్ ఇండస్ట్రీ జరుపుకున్న ఉత్సవము.
(ఎ) సిల్వర్ జూబిలీ, (బి) డైమండ్ జూబిలీ, (సి) ప్లాటినం జూబిలీ, (డి) గోల్డెన్ జూబిలీ

5 ఇనుము మరియు ఉక్కు పరిశ్రమలు చాలామటుకు ఇక్కడ ఉన్నాయి
(ఎ) మాల్వా మైదానము, (బి) బుందేర్‌ఖండ్, (సి) ఛోటా నాగ్‌పూర్ మైదానం, (డి) ఇవేవీ కావు.

6. ఎలక్ట్రిసిటీ వినియోగానికి బిల్లు దీనిపై ఆధార పడి ఉంటుంది.
(ఎ) వోల్టేజి, (బి) వాటేజ్, (సి) ఓమ్స్ (డి) కరెంట్.

7 భారతదేశంలో అణుశక్తి వినియోగానికి అవసరమైన యురేనియంను ఉత్పా దించే రాష్ట్రం ఏది?
(ఎ) బీహార్, (బి) ఒరిస్సా, (సి) కర్ణాటకా, (డి) రాజస్థాన్

8 క్రింది వాటిలో ఏది యునైటెడ్ స్టేట్స్ ఆర్గనైజేషన్‌కి చెందనిది?
(ఎ) ILO, (బి) FAO, (సి) ASEAN, (డి) IMF

## తెలివికి పరీక్ష

1 క్రింది వరుసలో తరువాతి రెండు సంఖ్యలు ఏవి?
1 4 9 16 25 36 – – ?

### మొట్టమొదటి నౌక

మొట్టమొదట తెలుసుకోబడిన నౌక 4500 సంవత్సరాలకు పూర్వం ఈజిప్టులో నిర్మించ బడింది. 30 మీటర్ల పొడవుగా ఉండే సముద్రం మీద ప్రయాణం చేయడానికి నావికుల శక్తి గాలి కెరటాల మీద ఆధారపడి ఉండేది.

"జీవితమనే సర్కసులో మనస్సనే కోతి
శరీరమనే గాడిదపై స్వారీ చేస్తుంది."

2 క్రింద సూచించిన వరుసలో ఇముడనిది ఏది?
విజ్ఞాన కోశము, నిఘంటువు, నవల, పారిభాషిక పదకోశము,

3 అనేక తెలుగు కీర్తనలు రచించిన భక్తాగ్రేసరుడు త్యాగరాజస్వామికి ఈ సంవత్సరం ఎన్నో ఆరాధన జరిగింది
(ఎ) 113, (బి) 123, (సి) 133, (డి) 143

4 క్రింది వాక్యాలకు తెనుగు జాతీయములను వ్రాయండి.
(ఎ) ఇద్దరికీ అనుకూలంగా చెప్పేతీర్పు,
(బి) ఉన్నది ఉన్నట్టు జరిగినది జరిగినట్టు చెప్పడం.

5 ఇటీవల పద్మవిభూషణ్, మెగ్సేసే అవార్డులు గ్రహించిన ఎమ్.ఎస్ సుబ్బులక్ష్మి 1988-89లో పొందిన అవార్డు ఏది? ఎవరు ఇచ్చారు?

6. క్రింది ఖాళీలను అర్థవంతమైన పదాలతో పూరించండి
______ మనస్సు ______ దృష్టి వలననే ఏకాగ్రత సాధ్యపడుతుంది

7 వేదాంతులకు ప్రత్యేకంగా దేవుడు లేడు, ఆత్మ లేదు, స్వర్గ నరకాలు లేవు, కర్మలేదు మరి వారికున్నది ఏమిటి? అది దేన్ని సూచిస్తుంది?

8. నిప్పుకు వేడి, నీటికి చల్లదనం, వేపకు చేదు ఎలా వచ్చాయి?

## మాటల మహిమ

1 కునుకు · నిద్రచేతూలు (ఎ), తగ్గు (బి), తాకట్టు (సి), కుంటివాడు (డి).
2. కుతుక: కుత్తుక (ఎ), కంఠము (బి), కుత్తిక (సి), కురూపి (డి).
3 గుట్టు రహస్యము (ఎ), ధైర్యము (బి). వంచన (సి), బీరువు (డి)
4 గమ్మత్తు: చమత్కారము (ఎ), వేడుక (బి), వెల (సి), చలించు (డి)
5 కోడిగము వంచన (ఎ), శృంగార చేష్ట (బి), పరిహాసము (సి), వ్యర్థము (డి).
6 దిక్కు దెస (ఎ), మార్గము (బి), పది అనుసంఖ్య (సి), రక్షకుడు (డి).
7 తెరువు మార్గము (ఎ), దారి (బి), న్యాయము (సి), ఉపాయము (డి)
8 నిలుచు నిలుచుండు (ఎ), వర్తించు (బి), మిగులు (సి), బ్రతుకు (డి)

(జవాబులు వ పేజీ చూడండి)



"మనస్సు మౌనం వహించినప్పుడు పరమాత్మ పలుకులు వినిపిస్తాయి."

# ఉదజని - రేపటి ఇంధనము

ఉదజని విశ్వంలో లభిస్తూన్న సామాన్య మూలద్రవ్యము. అణువిస్ఫోటనం వల్ల నక్షత్రాలలో ఉదజని హీలియంగా మారుతూన్నప్పుడు నక్షత్రాలు కాంతిని ప్రసరిస్తున్నాయి. ఒక కిలో గ్రాము ఉదజని మండినప్పుడు పెట్రోలుకి మూడురెట్లు అధికంగా 33 కిలో వాట్ అవరుల విద్యుచ్ఛక్తి విడివడుతుంది. ప్రస్తుతం ప్రపంచం మొత్తం మీద 32 మిలియను టన్నుల ఉదజని వినియోగవడు తూంది సగం ఉదజనితో ఎరువుల ఉత్పాదనలో వాడే అమ్మోనియా ఉత్పాదింపబడుతూంది. మిగిలిన సగంతో ప్లాస్టిక్స్ ఉత్పాదనలో వాడే తక్కువ రకం ఆల్కహాల్ మెథనోల్ (Methanol) ఉత్పాదింపబడుతూంది. ద్రవ రూపంలో ఉండే సోయాచిక్కుడు నూనెను ఉదజనితో గట్టిపరచి మార్గరీన్‌ను తయారు చేస్తున్నారు ఉదజనితో ఉష్ణశక్తిని, విద్యుచ్ఛక్తిని కలిగించుకోవచ్చు. మూలద్రవ్యములలో మిక్కిలి తేలికైనది ఉదజని. అనేక బిలియను సంవత్సరాల నుండి లభిస్తూన్న ప్రాతిపదిక మూల ద్రవ్యము.

ఉదజని, ఇతర ఇంధనాలు ముఖ్యంగా పెట్రోలుకు బదులుగా వాడుకో దగినది భావికాలపు కారులు తక్కువ ఇంధనాన్ని వినియోగించుకోవడమే గాక ఈనాడు బాగా అభివృద్ధి చెందిన ఆధునిక కారు కంటే మిక్కిలి తక్కువ పరిమాణంలో కాలుష్యాలను కలిగించేదిగా ఉండాలి 1973 నుంచి ప. జర్మనీలో డెయమ్‌లెర్ - బెంజ్ కార్లకు ఉదజనిని సెకండరీ ఇంధనంగా ఉపయోగించడానికి అనేక పరిశోధనలు చేస్తున్నారు. ఉదజని మరియు ఉదజని పెట్రోలు మిశ్రమంతో కార్లను నడపడానికి బెర్లిన్‌లో ప్రయోగాలు చేస్తున్నారు. డెయమ్‌లెర్ హైడ్రైడ్ స్టోరేజి విధానాన్ని అనుసరిస్తే, BMW ద్రవరూపంలో ఉదజనిని వాడుతుంది. ఇది ఉష్ణనిరోధకం కావింపబడిన కంటైనర్లలో - 253 డిగ్రీల సెంటీగ్రేడు దగ్గిర నిల్వ చేయబడుతుంది. ఈ ఉష్ణోగ్రతను నిలబెట్టడం చాలా ముఖ్యం. లేకపోతే ఉదజని వాతావరణంలో హరించి నష్టమైపోతుంది. కంబస్టన్ విధానం పెట్రోలు ఇంజనుతో సమానంగా ఉంటుంది. ఇంజక్షన్ విధానంలో ఉదజనిని సిలిండర్లలోకి ఇంజెక్ట్ చేస్తారు. ఇది ఇచ్చట మండింపబడుతుంది. అధిక

(మిగతా 9 వ పేజీలో)

## లామా ఉమ్ముతుంది



ఒంటె జాతికి సంబంధించిన లామా (Llama) దక్షిణ అమెరికాలో నివసిస్తుంది. ఒంటెలాగే ఇదికూడా నీరు లేకుండా అనేక వారాలపాటు జీవిస్తుంది. దీనికొక దురభ్యాసం ఉంది. ఇష్టం లేని వారిని చూస్తే ముఖం మీద ఖాండ్రించి ఉమ్మేస్తుంది.

"పరమాత్మ కోసం కేవలం దేవాలయాల్లోనే వెతకకండి. పసిపాపల నవ్వుల్లో, దీనుల కన్నీటిలో కూడా చూడండి."

# మారేడు పండు

## వి. నాగరాజు

భారతదేశంలో లభించే మంచి పుష్టికర మైన పండు మారేడుపండు. ఈచెట్టు మొండి జాతికి చెందినది. అన్ని భూములలోను, వివిధ వాతావరణాలలోను ఇది ప్రవృద్ధి పొందుతుంది. పండుపై చిప్ప గట్టిగా ఉండడం వల్ల చాలాకాలం నిల్వ ఉంటుంది. ట్రాన్స్



పోర్టుకుగానీ, అమ్మకానికి గానీ ఏవిధమైన ఇబ్బందులు ఉండవు

మారేడు భారతదేశంలో మిక్కిలి ప్రాచీన మైనది. చరిత్రకు పూర్వకాలంనుంచి ఇది చాలా ప్రసిద్ధిగా ఉంది. దీనికి పురాణ ప్రసిద్ధి ఉంది హిందువులు సాంప్రదాయకంగా మారేడు దళాలను శివుడికి అర్పిస్తారు. మారేడు చెట్లు చరిత్ర వేదకాలపు నాటివి. రామాయణ కాలంలో కూడా దీనిని గురించి తెలుసు శ్రీరామచంద్రుడు వివిధరకాల పండ్లలో మారేడు పళ్లను కూడా చేర్చి నైవేద్యం చేసి ధర్మకార్యాలు చేసాడు అజంతా గుహలలో ఇతర ఫలాల చిత్రాలతో పాటు మారేడు ఫలం చిత్రం కూడా ఉంది.

వృక్షశాస్త్రరీత్యా బేల్ ఏగ్‌లి మార్మెలోస్‌ఎల్. రూటేసియే (Rutaceae) కుటుంబానికి చెందినది. సాధారణంగా మారేడు చెట్టు 6-8 మీటర్లు ఎత్తు పెరిగే ఆకురాల్చు చెట్టు మూడేసి ఆకులు చేరి ఉంటాయి ఆకులు సువాసనగా ఉంటాయి.

భారతదేశంలోను, శ్రీలంకా, పాకిస్థాన్, బంగ్లాదేశ్, బర్మా, థాయ్‌లాండ్, ఆసియాలో ఆగ్నేయ ప్రదేశాలలోను ఇది విస్తారంగా పెరుగు తుంది. 1759లో ఇది భారతదేశంనుంచి యూరపుకు తీసుకుపోబడింది. ఉత్తరప్రదేశ్, బీహార్, ఒరిస్సా, పశ్చిమబెంగాల్, మధ్యప్రదేశ్ లలో సాగుబడి జరగని ప్రదేశాలలో ఈ పళ్లు బాగా పండుతున్నాయి. దక్షిణ భారతదేశంలో సాధారణంగా ఇళ్లలో దీనిని పెంచుతారు.

మామిడి, ఆరెంజ్, అరటి, జామ, సపోటా పళ్లలాగ దీనికి అంత గిరాకీ ఉండదు. ఇతర పళ్ల జాతి మొక్కలు విస్తారంగా బయలుదేరని ప్రదేశాలలో కూడా ఇది బాగా పెరుగుతుంది.

( 8 వ పేజీ తరువాయి)

వ్యయంతో కూడిన ఉదజని కార్లు ఇప్పటి పెట్రోలు మరియు డీసెల్ కార్లతో పోటీ పడలేవు. ఉదజనిని గురించిన సాంకేతిక పరిజ్ఞానం అంతగా ప్రవృద్ధి పొందలేదు. భవిష్యత్తులో ఇతర ఇంధనాలకు బదులుగా వాడుకోవచ్చు. 21వ శతాబ్దం "సౌర, ఉదజని యుగం" అని చెప్పుకోవాలి

—'జర్మన్ న్యూస్' సౌజన్యంతో

"ప్రాణజ్యోతి ఎప్పుడో ఒకరోజు ఆరిపోక తప్పదు
ఈలోగా ఇతరులకు వెలుగు నెందుకీయరాదు?"

4000 అడుగుల ఎత్తు మీద-7° c వద్ద కూడా ఇది పెరుగుతుంది

మారేడు పండులో 100 గ్రాముల తినగల పదార్థంలో 61.5 గ్రాముల నీరు, 1 8 గ్రా.ల ప్రోటీనులు, 0.39 గ్రా ల క్రొవ్వు పదార్థాలు, 1 7 గ్రా.ల ఖనిజద్రవ్యాలు, 31.8 గ్రా.ల కార్బో హైడ్రేటులు, 55 మి.గ్రాల రిబోఫ్లావిన్, 1.1 మి.గ్రా నియాసిన్, 8 మి.గ్రాల విటమిను C ఉంటాయి. గింజలలో 62 శాతం ప్రోటీనులు, 32 శాతం నూనె, 3 శాతం కార్బోహైడ్రేటులు, 3 శాతం బూడిద ఉంటుంది

సంస్కృత ప్రాచీన వైద్యగ్రంథం చరక సంహితలో దీని ఔషధ గుణాలు ఎక్కువగా వివరింపబడ్డాయి. మారేడుపండులో లభించే మార్మిలోసిన్ (Marmelosin) వల్లే దీనికి ఔషధ విలువ ఏర్పడి ఉండవచ్చు. బాగా పండిన పండు ధాతువర్ధకమైన టానిక్, రక్త. స్రావాన్ని నిలుపుతుంది. మంచి విరేచనకారి. గుండెకు, మెదడుకి మంచిది. పచ్చికాయ జీర్ణకారి అజీర్ణ బాధలకు, జిగట విరేచనాలకు మంచిది. క్షయవ్యాధికి మంచి ఔషధం దీర్ఘ కాలవు క్షయలకు కూడా ఇది అమోఘంగా పని చేస్తుంది.

మారేడు చెట్టు అన్నిభాగాలు - కొమ్మలు, బెరడు, వ్రేళ్లు, ఆకులు, పచ్చికాయలు ప్రతీది మానవునికి సంభవించే ఏదో ఒక రోగానికి ఔషధంగా పనిచేస్తుంది పచ్చికాయలతో మురబ్బా తయారుచేస్తారు. ఇది అన్ని అజీర్ణా లకు దివ్యమైన ఔషధంగా పనిచేస్తుంది. మారేడు పండ్లు గుజ్జుతో రకరకాల పానీ యాలు కూడా తయారుచేస్తారు పచ్చి కాయలు ముక్కలుగా కోసి ఎండబెట్టి వరుగు తయారుచేసి ఉపయోగించుకుంటారు మారేడు జిగురు అంటించుకోడానికి, చెమ్మ ఎక్కకుండా చేయడానికి ఉపయోగిస్తారు.

## మొక్కల పెంపకంలో క్రొత్తవిధానం

ప్రపంచంలో జనాభా ఎంత పెరిగిపోయినా మొక్కల పెంపకంలో క్రొత్త విధానం అనుసరిస్తే భయపడక్కర్లేదు. యునైటెడ్ నేషన్స్‌వారి అంచనాల ప్రకారం ఇప్పుడు 5,000,000,000 పైగా ఉన్న జనాభా 2000 సంవత్సరంనాటికి 6,000,000,000 అవుతుంది.

క్రొత్త విధానంలో మొక్కలు పెంచడంవల్ల ప్రపంచంలో 12,000,000,000 నుండి 16,000,000,000 మందికి సరిపోయే ఆహార ధాన్యాలు పండుతాయి. మరింత [illegible] క్రొత్త విధానాలను అనుసరించడంవల్ల ఆహార ధాన్యాలు విస్తారంగా పండుతాయి. ప్రపంచం అంతటా అన్ని దేశాలు క్రొత్త విధానాన్ని సాంకేతిక విజ్ఞానంవల్ల ఎంతో లాభాన్ని పొందుతాయి.

[illegible] 1950 లో [illegible] (25 ఎకరాలు) నేలలో 3 టన్నుల గోధుమ పండించ[illegible] 7 టన్నుల గోధుమ పండించ[illegible]

"లేనిదాన్ని సృష్టించడంలో కొందరికి ఆనందం,
ఉన్నదాన్ని తొలగించడంలో మరికొందరికి సంతోషం."

# కాలం వృథా చేయవద్దు

మనకు ఉన్న మొత్తం సమయంలో తీరిక సమయం మూడవవంతే అయినా ఆ తీరిక సమయాన్ని వినియోగించుకునే విధానం మన స్వభావాన్నీ, శీలాన్నీ తెలియజేస్తుందని మనస్తత్వ శాస్త్రజ్ఞులు అందరూ ఏకగ్రీవంగా అంగీకరించారు. కానీ మనలో చాలామంది దీంట్లో ఉండే నిజాన్ని గ్రహించము



ముఖ్యంగా ఇరవై ఏళ్ళలోపు పిల్లలందరూ తమ తీరుబడిని ఆనందంగా చేసుకోడానికి కులాసాగా తిరుగుతూండటం మనం చూస్తూనే ఉన్నాము.

భగవంతుడు మనకు ప్రసాదించిన తీరుబడి లేక తీరిక సమయాన్ని సద్వినియోగం చేసుకోవాలి వృథా చేసుకోకూడదు. ఒక మనిషిని వృథాగా హత్య చేసారన్నా లేక మనం పెంచుకునే ప్రాణులను హత్య చేసారన్నా మనం ఎంత భయపడిపోతామో! కానీ ప్రతీ రోజూ ఆఫీసు పని అయిన తరువాత, లేక సెలవు రోజులలో ఇతరులు తీరిక సమయాన్ని ఎంతో వృథా చేస్తున్నా చూసి ఊరుకుంటాము. వాళ్లేదో సుఖంగా ఉన్నారని అసూయ, ఈర్ష్య చెందుతాము

మన దేశనాయకులు దేశంలో ఎన్నెన్నో విలాస కేంద్రాలు, మ్యూజియంలు, లైబ్రరీలు, ప్రదర్శనశాలలు ఏర్పరచారు. కానీ లాభంతో ఆనందాన్ని అనుభవించడానికి, సృజనాత్మకమైన హాబీలకు ఎంతమాత్రం అవకాశం కల్పించడం లేదు

బ్రహ్మాండమైన భావనా నిర్మాణ యోజనలు చేపట్టి భగవంతుడు సృష్టించిన సహజ సుందరమైన ప్రకృతి వనరులను ఎన్నిటినో నాశనం చేస్తున్నారు దీనివల్ల ప్రకృతిమాత ఒడిలో మనకు శాంతి లభించడంలేదు. యాతనామయమైన జీవితంలో సుఖం కలిగించుకోడానికి, సృజనాత్మక శక్తిని ప్రవృద్ధి చేసుకోడానికి అవకాశం లభించడంలేదు

మనం లభింపచేసుకున్న తీరిక సమయాలలో సృజనాత్మక హాబీలను అభ్యాసం చేసుకోడానికి బదులు రేడియో, నవలలు, సినీమా మొదలైన వాటికి దాసులమై పోతున్నాము ఒకప్పుడు మనం సంగీతం నేర్చుకుని పాడుకునే వాళ్లం. ఇప్పుడు ఎవరో పాడిన పాటల టేపులుతో

## ముండా జాతుల వివాహాలలో శకునాల పాత్ర

బీహార్ చోటానాగపూర్‌లో నివసించే ముండా జాతుల వివాహాలలో శకునాలకు చాలా ప్రాముఖ్యత ఉంది. వరుని తండ్రి మొదట వధువు ఇంటికి ఒక వ్యక్తిని పంపుతాడు. తరువాత పెళ్లివారితో తను బయలుదేరి వెళతాడు. దారిలో గద్దలి మరియు పాల చెట్లలో ఉన్నవాడు కనిపిస్తే అది దుశ్శకునంగా భావించి పెళ్లి ముహూర్తం మార్చి మరుసటిరోజుకు పెట్టుకుంటారు.

"కొందరు ఎన్నిబాధలయినా సహించగలరుగానీ ఇతరులు బాగుపడ్డారంటే భరించలేరు."

సంతుష్టి పడిపోతున్నాము ఒకప్పుడు ఫీల్డులో క్రికెట్ ఆడుకునేవాళ్లం ఇప్పుడు రేడియో దగ్గర కూర్చుని సమీక్ష వింటాం లేక టివిలో చూస్తూ వింటాం అదీ లేకపోతే స్టేడియంలో గంటల తరబడి కూర్చుని చూస్తాం.

సెలవులు ఎప్పుడు వస్తాయా అని కాచుకుని కూర్చుంటాం. కానీ దానిని మనలో ఎంత మంది సద్వినియోగం చేసుకుంటున్నారు. చాలామంది మాగజైనులను, పుస్తకాలను సంపాదించి పెట్టుకుంటారు నిత్యజీవితంలో చదవడం మంచి అభ్యాసమే. కానీ సెలవు రోజు ఉపయోగకరమైన మరో పని చేసుకోవాలి. రోజూ ఒకటో, రెండో ఉత్తరాలు వ్రాసుకోవచ్చు. వ్రాయడానికి ఏమీ తోచకపోతే క్రెయానులు, రంగులు తీసుకుని అందమైన గ్రీటింగ్ కార్డులు తయారుచేయడానికి ప్రారంభించు

బహిరంగ సభలో మాట్లాడాలని అందరికీ ఆశ ఉంటుంది. యువకులు క్రొత్త విషయాలను గురించి చర్చించుకోడానికి సమావేశాలు జరుపుకోవాలి. డిబేటింగ్ క్లాసులు, రీడింగ్ సర్కిల్స్ మొదలైనవి సెలవులలో మనోవికాసాన్ని కలిగిస్తాయి. చర్చలకు మంచి విజ్ఞానాత్మకమైన విషయాలను ఎన్నుకోవాలి.

క్విజ్ పోటీలను ఏర్పాటు చేసుకోవాలి దీనికి సంబంధించిన విషయాలు క్రికెట్, వివిధ రచయితలు, గ్రంథాలు, చారిత్రక ప్రసిద్ధిని పొందిన నగరాలు, దేశయోధులు మొదలైన విషయాలు ముందుగానే చెప్పుకోవాలి. పోటీతో ప్రతీరోజూ అయిదో, ఆరో క్రొత్త ఇంగ్లీషు పదాలు నేర్చుకో డిక్షనరీగానీ, మంచి మాగజైనుగానీ దీనికి ఉపయోగపడుతుంది.

సెలవురోజున ఇంటిపట్టు వదిలి వెళ్లడానికి వీలులేని పరిస్థితులలో విసుగు చెందకుండా ఉండాలంటే టూరిస్ట్ గైడు తీసుకో లేక టూరిస్టు బ్యూరోనుంచి కొన్ని ఫోల్డర్స్ తెచ్చుకో భారత దేశపు పండుగలు, యాత్రాస్థలాలు, మతాలు, చేతిపనులు మొదలైన వాటిమీద చర్చలు ప్రారంభించు

ప్రపంచంలో వింతలు చూడడానికి డీలక్స్ ఎయిర్ కండిషన్డ్ రైలులో ప్రయాణం చేయలేకపోవచ్చు జెట్‌ప్లేన్‌లో కూర్చుని ఎగిరి వెళ్ల లేక పోవచ్చు అయితే అంతకంటే వేగంగా నీవు భావ ప్రపంచంలో ప్రయాణం చేయగలవు

●

## నమ్మలేని నిజాలు

### అత్యద్భుతంగా భద్రపరచబడిన మొహెంజొదారో

MOHENJODARO

సుమారు 60 సంవత్సరాలకు పూర్వం 5000 సంవత్సరాలనాటి పురాతన మొహెంజొదారో నగర ప్రదేశం తిరిగి కనుగొనబడింది. [illegible] పరిశోధనలను [illegible] అది అత్యద్భుతంగా [illegible] పరచబడింది. [illegible] నాగరికతకు చెందిన ప్రజలు అత్యుత్తమమైన అభివృద్ధిని సాధించారు [illegible] [illegible] ఆనాటి స్త్రీలు నగలు [illegible] [illegible] సుమారు 1500 [illegible] నగరం [illegible] అంతరించి పోయింది.

"ఒక మహోన్నత భాద్యతను నిర్వహించడానికి తగిన అర్హత, దక్షత, శుద్ధత, చరిత్రగల తలమీదే 'కిరీటం' అమరింది"

# అక్కడా-ఇక్కడా

## 1.4 మిలియను టన్నుల ధాన్యం ఎలుకలు తినేస్తున్నాయి

బంగ్లాదేశ్‌లో ప్రతీసంవత్సరం 1.4 మిలియను టన్నుల దాన్యం ఎలుకలు నాశనం చేస్తున్నాయి 6,00,000 టన్నుల ధాన్యం



ఇతర పురుగులు, కీటకాలు, చిలుకలు తినేస్తున్నాయి ఇక్కడ 18 మిలియను టన్నుల ధాన్యం ప్రతీసంవత్సరం ఉత్పత్తి అవుతూంది 10 కోట్ల జనాభా ఆహార అవసరాలను భర్తీ చేసుకోడానికి 2 మిలియను టన్నుల ధాన్యాన్ని ఈదేశం దిగుమతి చేసుకుంటుంది.

—'సి ఇ ఇ.ఎన్.ఎఫ్ ఎస్' సౌజన్యంతో

* * *

## 5000 సంవత్సరాలనాటి పురాతన ఫారోనిక్ ఫ్యూనరల్ బోట్

కెయిరో సమీపంలో చియోప్స్ పిరమిడ్‌లో లోతుగా ఒక గోతిలో సీలుచేయబడిన ఫారోలు ఉపయోగించిన 5000 సంవత్సరాలనాటి ప్రేత నౌక (funeral boat) ను వీడియో చిత్రాలు తీయడానికి అమెరికన్ మరియు ఈజిప్షియన్ శాస్త్రజ్ఞులు అంతరిక్షయుగపు సాంకేతిక విజ్ఞానాన్ని అనుసరించారు వీరు కెమెరాలను 10 సెం.మీల వైవారంగల సన్నని ద్వారం గుండా, సుమారు 2600 బిసిలో ఈజిప్షియనులు సీలుచేసిన గోతిలోకి దింపి అతి జాగ్రత్తగా ఫోటోలు తీసారు.

* * *

## అందమైన ఆర్కిడ్‌లు మరియు రోడోడెండ్రానులు

భారతదేశంలో అందమైన పూవులు పూసే రకరకాల ఆర్కిడులు మరియు సతతహరిత ములైన (rhododendrons) చెట్లు అంతరించిపోయే పరిస్థితులలో ఉన్నాయని బొటానికల్ సర్వే ఆఫ్ ఇండియావారు సంకలనం చేసిన రెడ్ డాటా బుక్‌లో చెప్పబడింది.

* * *

## భారతదేశంలో 329 మిలియను హెక్టేరుల బీడు ప్రదేశం

భారతదేశంలో ఉన్న మొత్తం 329 మిలియను హెక్టేరుల బీడు ప్రదేశంలో 30 మిలియను హెక్టేరుల భూమిలో అసలు చెట్లు, చేమలు లేవు. ఆరావల్లీ పర్వతశ్రేణికి పశ్చిమ ప్రదేశం, మూటికి రెండు వంతులు రాజస్థాన్ బీడు ప్రదేశాలని చెప్పుకోవచ్చు.

* * *

## వెటివేర్ భూక్షరణ నివారకము

గడ్డి మైదానాలలో పెరిగే గరిక, బంజరు భూములలో పెరిగే పొడుగాటి గడ్డివలె గాక వెటివేర్ (Vetiver) ప్రత్యేకమైన గడ్డి ఇది

"ప్రవచనాలకు, ఆచరణకు మధ్య అంతరం అంతరిస్తే మనిషి మనీషి అవుతాడు."

ప్రపంచంలో ఎక్కడైనా బాగా పెరుగుతుంది. భూక్షరణాన్ని నివారించి ప్రపంచ వ్యాప్తంగా వ్యవసాయాభివృద్ధిని సంరక్షిస్తుంది. వెటివేర్ గడ్డిని పెంచడం వల్ల భూక్షరణం నివారింపబడటమేగాక భూమిలో తేమ పెరగడంవల్ల అధిక ఫలసాయాలకు సహకరిస్తుందని ప్రపంచ బాంక్ నిపుణులు తమ పరిశోధనల వల్ల తెలుసుకున్నారు

* * *

## రూ. 17 లక్షల తమలపాకు ఎగుమతి చేయబడింది

1987-88వ సం లో మొత్తం తమలపాకుల ఎగుమతి విలువ రూ 17 లక్షలు

* * *

## ప్రాచీన కంచుపాత్ర 2.97 మిలియను డాలర్లకు అమ్మబడింది

చైనావారు 1600 BC మరియు 1100 BC మధ్య గేదె ఆకారంలో పోతపోసి తయారు చేసిన పెద్ద కంచుపాత్ర ఇటీవల లండన్ నగరంలో వేలం వేస్తే 2.97 - మిలియను డాలర్లు లభించింది. పితృదేవతలకు నైవేద్యాలు చేయడానికి చైనాలో మిక్కిలి భాగ్య వంతులు జంతువుల ఆకారాలలో పోతపోసి తయారు చేసిన కంచుపాత్రలు ఉపయోగించేవారు.

* * *

## అంతరిక్షంలో సౌరశక్తి కృత్రిమ ఉపగ్రహాలు

అంతరిక్షంలో పెద్దపెద్ద సౌరశక్తి కృత్రిమ ఉపగ్రహాలను ఏర్పాటు చేయటంవల్ల ప్రపంచంలో విద్యుచ్ఛక్తి కరువు 2025 నాటికి తీరుతుందని కొందరు నిపుణులు అభిప్రాయ పడుతున్నారు

* * *

## సజీవ వృక్షాల మ్యూజియం

గుజరాత్ బరోడాలో ఇండియన్ పెట్రోకెమికల్ కార్పొరేషన్ లిమిటెడ్‌వారు 1,00,000 కు పైగా వృక్షాల 'సజీవ మ్యూజియాన్ని' (Living Museum) ఏర్పాటు చేసారు. ఈ మ్యూజియం కోసం ఏర్పాటైన మొత్తం 75 హెక్టేరుల నేలలో 32 హెక్టేరుల వైశాల్యంలో 70 అంతరించిపోతూన్న చెట్ల జాతులను కూడా పెంచుతున్నారు

* * *

## ప్రతిదినం పరిశ్రమలలో కలిగే ప్రమాదాలవల్ల 8000 మంది గాయపడుతున్నారు

భారతదేశంలో పారిశ్రామిక రంగంలో కలిగే ప్రమాదాలవల్ల రోజుకు అధమం 2 లేక 3 మంది మరణిస్తున్నారు. సుమారు 8000 మంది గాయపడుతున్నారు. 1970లో ప్రతీ సంవత్సరం సరాసరి 3 లక్షల పారిశ్రామిక ప్రమాదాలు 80 దశాబ్దం మధ్యకాలంలో 2.75 లక్షలకు తగ్గిపోయాయి.

## మైక్రోబుక్

[illegible] (Podolsk) నగరం ఇటీవల ప్రచురింపబడిన మైక్రోబుక్ [illegible] 25 x 35 మి.మీ మరియు 6 x 9 మి.మీలు [illegible]

"విభిన్నమతాలు సహజీవనం నెరపుతూన్న సమాజంలో మతం, రాజకీయాల మధ్య పొత్తు వివత్కరమైనది."

# జాగ్రఫీ - విజ్ఞానదాయకము

డా. హెచ్.ఎస్.లారెన్స్

తెలియని భూప్రదేశాలు, మనుషులు గురించి తెలుసుకోడానికే కాదు జాగ్రఫీ. పాఠశాలలలోను, కాలేజీలలోనూ, భూగోళ శాస్త్రాధ్యయనానికి తగిన ప్రాముఖ్యతను ఇవ్వాలి

సాంకేతిక రంగంలో కలుగుతూన్న మార్పుల వల్ల మరియు నిరంతరం మానవుడు పరిసరానుగుణ్యంగా సరిపుచ్చుకోడానికి చేసే



ప్రయత్నాలవల్ల భౌతిక భూగోళంలో మార్పులు సంభవిస్తూంటాయి. ప్రకృతివల్ల, మానవుని వల్ల కూడా నిరంతరం భూభౌతిక, సాంఘిక వాతావరణంలో మార్పులకు దోహదం కలుగుతుంది. నేటి జాగ్రఫీకి, నిన్న మొన్నటి జాగ్రఫీకి మరియు ముందు రాబోయే రేపటి జాగ్రఫీకి సంబంధం ఉండదు. గణితశాస్త్రంలోగానీ, వైజ్ఞానిక శాస్త్రంలోగానీ నూతన విషయాలకు ప్రాముఖ్యత ఉన్నట్లే క్రొత్త జాగ్రఫీకి ప్రాముఖ్యత ఉంటుంది.

భూగోళ శాస్త్రాధ్యయనం మరియు పరిశోధనల వల్ల మనం తెలుసుకునే ఆర్థికాభివృద్ధి అధ్యయనం, పారిశ్రామికాభివృద్ధి, మెట్రోపాలిటన్ ప్రగతి, ప్రాంతీయ యోజనలు, జీవావరణ సమతౌల్యత, కాలుష్యము, గ్రామీణ జీవనం, జనాభా పరిస్థితులు, ప్రాంతీయ సహజీవనము, వనరుల పరిరక్షణ మొదలైన విషయాలన్నీ ఆర్థిక యోజనలకు, ప్రగతికి అవసరమైన ప్రాతిపదిక విజ్ఞానాన్ని కలిగిస్తాయి. విదేశాలతో సంబంధములను పెంపొందించు కోడానికి, వాణిజ్యము మరియు వ్యాపార అభివృద్ధికి ముఖ్యమైనది జాగ్రఫీ.

మానవ జీవితంలో సన్నిహిత సంబంధం కలిగి ఉండటంవల్ల జాగ్రఫీకి సర్వతోముఖ ప్రాముఖ్యత ఉంది. 'మానవజాతి సక్రమ అధ్యయనం మానవుడు' అని పోవు చెప్పినది వాస్తవం. జాగ్రఫీ సంయోగాత్మకమైన పరిపూర్ణవిజ్ఞానము. చరిత్ర, విజ్ఞానశాస్త్రము, గణిత శాస్త్రము, సాహిత్యము, ఆర్థికవ్యవస్థ, సాంఘిక శాస్త్రము మొదలైన విషయాలన్నిటిపైన జాగ్రఫీ ప్రభావం ఉంటుంది.

భౌగోళిక విజ్ఞానంవల్ల ప్రపంచం తెలుస్తుంది. పాఠశాలలో చదివే అనేక విషయాలలో ఒక్క జాగ్రఫీ మాత్రమే భూప్రదేశాన్ని గురించిన వివరాలను తెలియజేస్తుంది. ప్రజా పాలిత రాజ్యంలో ప్రజల విజ్ఞానాభివృద్ధికి నేడు జాగ్రఫీ సహకరిస్తుంది. జాగ్రఫీ నేర్చుకుని భౌగోళికంగా యోచింప గలిగినవాడే పరిపూర్ణ జ్ఞానవంతుడు.

జాగ్రఫీ సహాయంతో విజ్ఞానం అభివృద్ధి కలిగించుకోవాలనే నేను చెప్పదలచుకున్నది. సహజ ప్రవర్తన లేక నడవడిలో మార్పు విజ్ఞానంవల్ల లభిస్తుంది. పాఠశాలలో జాగ్రఫీ బోధించడంవల్ల విద్యార్థుల ప్రవర్తనలో మార్పు కలుగుతుంది ఒక్క విద్యార్థులలోనే కాదు ఉపాధ్యాయులలో, తలిదండ్రులలో, ప్రజానీకంలో ఈమార్పు కలగాలి

"అభ్యుదయ మార్గంలో పురోగమిస్తూ అభ్యున్నతిని సాధించాలంటే ప్రజలలో ఐక్యత, క్రమశిక్షణ అవసరం."

ప్రతి ఒక్కరూ తమ పరిసరాలకు భౌగోళిక విజ్ఞానాన్ని అనువర్తింప జేసుకోవాలి వివిధ వనరుల దుర్వినియోగం, లోపభూయిష్టమైన పెంటతుక్కు వితరణ విధానం, మొక్కలను, పెద్ద పెద్ద వృక్షాలను నరికివేయుట, నీటిని ప్రవహింప చేయకుండా ఉంచటం, ప్రకృతి రమణీయ ప్రదేశాలను పాడుచేయడం మొదలైనవన్నీ భౌగోళిక పరిజ్ఞానం లోపించడంవల్లే ఏర్పడుతున్నాయి. ఆచరణయోగ్యమైన పౌరధర్మాభివృద్ధికి జాగ్రఫీ సహకరిస్తుంది స్వచ్ఛంద సంస్థలుగా ఏర్పడి తమ పరిసరాలను సౌందర్యవంతం చేసుకోవడమే ఆచరణ యోగ్యమైన జాగ్రఫీ అదే పౌరధర్మం అనిపించుకుంటుంది. జాగ్రఫీ జాతీయ సమైక్యతకే గానీ, విభజనకు సహకరించకూడదు దేశభక్తితో, పరస్పర సహకారంతో సంఘీభావంతో ఉండటం జాగ్రఫీవల్ల నేర్చుకోవచ్చు.

నదీజలాలకై వివాదాలు, విద్యుచ్ఛక్తికై పోరాటాలు, జాతి కులమత వివాదాలు, బాషా విషయమైన కలహాలు, ఆహారధాన్యాల సరఫరాలపై వివాదాలు మనం జాగ్రఫీని (భూగోళశాస్త్రం) సక్రమంగా అవగాహన చేసుకోలేదని తెలియజేస్తూంది. "విశ్వైక కుటుంబంగా జీవించాలి లేకపోతే నశించి పోతాము" అని డా॥ రాధాకృష్ణ చెప్పారు పరస్పర వివాదాలను, కలహాలను, ద్వేషాలను ప్రవృద్ధి చేసే వారు సంఘద్రోహులు. ఇతర దేశాల వివిధ యోజనలు, సంస్కృతులు జాతీయోత్సాహాభివృద్ధికి సహకరిస్తాయి

జనానీకంలో పరస్పరావగాహనకు జాగ్రఫీ సహకరించాలి యువకులలో ఐకమత్యభావాన్ని పెంపొందించాలి విశ్వైక్యతకు సహకరించే వాటితో సరిపోల్చినప్పుడు పరస్పర వైషమ్యాలు ప్రాముఖ్యమైనవి కావని తెలుస్తూంది. అడ్డుగోడలు నిర్మించుకోడానికి కాదు, వివిధ దేశాలతో సన్నిహిత సంబంధం ఏర్పరచే వారధిగా జాగ్రఫీని బోధించాలి "మానవుల మనస్సులో యుద్ధభావాలు బయలు దేరతాయి కాబట్టి వారి మనస్సులలో శాంతికి సహకరించే భావాలకు దోహదం కలిగించాలి" అని యునెస్కో కాన్‌స్టిట్యూషన్ ప్రతిపాదిస్తుంది.

వ్యక్తిగత అనుభవము, వివిధ దేశాలను చూడడం జాగ్రఫీకి ముఖ్యమైనది జాగ్రఫీ అధ్యయనం సహన భావాభివృద్ధికి సహకరిస్తుంది తరగతి గదులలో భౌగోళికంగా నేటి పరిస్థితులను తెలుసు కున్నప్పుడు జాగ్రఫీ

(మిగతా 18 వ పేజీలో)

## రాజస్థాన్‌లో అధిక ప్రదేశం థార్ ఎడారి



రాజస్థాన్‌లో అధిక ప్రదేశం థార్ ఎడారితో కప్పబడి ఉంటుంది. మొత్తం 27 జిల్లాలలో 11 జిల్లాలలోని 2,80,751 చ.కి.మీ.ల వైశాల్యం మేర ఎడారితో కప్పబడి ఉంది. ఈ ఎడారి ప్రదేశంలో ఉన్న 1.5 కోట్ల మంది జనాభా, 2.5 కోట్ల పశువులు అభివృద్ధి మిక్కిలి కష్టం.

"నోరు జారకుండా మాటలను మన్నించగలిగితే
మన్ననకు పట్టిన మాలిన్యం వదులుతుంది."

# వజ్రాలు

భూగర్భ గోళంలో జనించే బ్రహ్మాండమైన ఉష్ణంవల్ల, ఒత్తిడివల్ల వజ్రాలు ఏర్పడతాయి. భూమిలోనుంచి గొట్టాలద్వారా వీటిని పైకి తీస్తారు. ఆభరణాలలో ఉపయోగించడానికి విలువైన జాతి వజ్రాలు దోషరహితంగా కోసి సానపెడతారు. ప్రస్తుతం దక్షిణ అఫ్రికా, జెయిరే, యుఎస్ఎస్ఆర్, భారతదేశము,



మరియు కొన్ని దక్షిణ అమెరికా దేశాలలోను వజ్రాలు గనులనుండి త్రవ్వబడుతున్నాయి.

వజ్రాలకు సంబంధించిన వింతవింత కథలు ఎన్నో ఉన్నాయి. సుప్రసిద్ధమైన 'కోహినూర్' వజ్రం భారతదేశానికి చెందినది. ఉజ్జయిని రాజధానిగా పాలించిన విక్రమాదిత్యుని కాలంనుంచీ భారతదేశాన్ని పాలించిన అనేక రాజులు దీనికి వారసులయ్యారు. 1526లో జరిగిన పానిపట్టు యుద్ధంలో బాబర్ సైనికులు ఇబ్రహీంలోడీ సైనికులపై బాణాల వర్షం కురిపించారు. ఓడించి రాసులకొద్దీ వస్తువులను కొల్లగొట్టారు ఈ కొల్లగొట్టిన వస్తువులలో కోహినూర్ వజ్రం ఒకటి మొగలాయి చక్రవర్తి షాజహాన్ (1628-66) గొప్ప ధనవంతుడు. ఇతడి కోశాగారంలో 'కోహినూర్' కొంతకాలం ఉంది. 1739 లో నాదిర్‌షా భారతదేశంపై దండెత్తి వచ్చి ఢిల్లీని ముట్టడించి 'కోహినూర్' ను పర్షియాకి తీసుకువెళ్ళాడు. ఈనాడు కోహినూర్ లండన్ నగరంలో బ్రిటిష్ సామ్రాజ్యాధిపతుల అమూల్య వస్తువులు భద్రపరచిన టవర్ ఆఫ్ లండన్‌లో ఉంది.

16వ శతాబ్దం చివరి భాగంలో నికోలస్ హార్లే డిసాన్సీ దగ్గర ఉన్న సాన్సీ వజ్రం గురించిన కథ చాలా వింతగా ఉంటుంది. సాన్సీ దీనిని తాకట్టు పెట్టడానికి తన మనిషికి ఇచ్చి స్విస్ దేశానికి వంపాడు. దారిలో అతను చంపబడ్డాడు. మరణించడానికి ముందు అతడావజ్రాన్ని మ్రింగాడు. సాన్సీ ఆ మరణించిన వాని శరీరాన్ని ఛేదించి వజ్రం తీసుకున్నాడు. తరువాత ఇది అనేకమంది చేతులలోకి వచ్చి చివరకు గొప్ప పార్సీ వ్యాపారస్థుడైన సర్ జెమ్‌సెట్‌జీ జెయ్‌జీభాయ్ అధీనంలోకి వచ్చింది. ఇప్పుడది విస్కౌంట్ అస్టర్ కుటుంబం వారి దగ్గర ఉంది.

1943 లో వజ్రాలను వెతికే రాఫెల్ సొలానోకి దక్షిణ అమెరికా వెనుజులాలో నీటి ప్రవాహంలో రాళ్ళగుట్టలలో మిక్కిలి స్వచ్ఛమైన వజ్రం లిబరేటర్ దొరికింది. ఇది కోడిగ్రుడ్డు ప్రమాణంలో ఉంటుంది. ఒక న్యూయార్కు వర్తకుడు హారీ విన్‌స్టన్, సొలానోకి 2,00,000 డాలర్లు ఇచ్చి దానిని తీసుకున్నాడు.

మరియొక అమూల్యమైన వజ్రం కుల్లినాన్ జనవరి 25, 1905న దక్షిణ అఫ్రికా ప్రిటోరియాలో ప్రీమియర్ గనులలో లభించింది. దీనికి ఆ గనిని కనిపెట్టిన సర్ థామస్ కులినాన్ పేరు పెట్టబడింది. ఇదే ప్రపంచంలో మిక్కిలి పెద్ద వజ్రం. దీని భారం 3,106కారట్లు 1907లో ఇది బ్రిటిష్ చక్రవర్తి 7వ ఎడ్వర్డ్‌కి బహూకరించబడింది. ఇది నాలుగు ముక్కలుగా కోయబడింది.

"స్వచ్ఛమైన జ్ఞానాన్ని సంపాదించుకోగలిగితే
బుద్ధి జాడ్యంవల్ల కలిగిన ఉన్మాదం కుదురుతుంది."

ఇవి ఇప్పుడు బ్రిటన్ కిరీట ఆభరణాలలో ఉన్నాయి. 530.2 కారట్లు తూగే పెద్దముక్క 'స్టార్ ఆఫ్ ఆఫ్రికా' రాజదండంలో పొదగబడింది.

భారతదేశానికి చెందిన మరియొక అపూర్వమైన వజ్రం 'గ్రేట్ మొగల్' భారతదేశంలో సానబెట్టి కోయబడింది దక్షిణ భారతదేశం కొల్లూరులో లభించిన 'గ్రేట్ మొగల్' ఫ్రెంచి



దేశపు రత్నాల వ్యాపారి టావెర్నీర్ (Tavernier) 1666లో ఔరంగజేబు ఆస్థానంలో ఢిల్లీలో చూసాడు దీనిని నాదిర్‌షా 1739లో పర్షియాకు తీసుకు పోయాడు. గ్రేట్ టేబిల్, సీ ఆఫ్ లైట్, క్రౌన్ ఆఫ్‌ది మూన్ వంటి ఇతర భారత దేశపు వజ్రాలు నేడు కనిపించడం లేదు. ఇవన్ని పర్షియన్ ఖజానాలో భద్రపరచి ఉండవచ్చు.

తమిళనాడు శ్రీరంగంలో విష్ణు దేవాలయం నుంచి ఒక ఫ్రెంచి గ్రెనేడియర్ ఆర్‌లోవ్ (Orlov) వజ్రాన్ని తస్కరించుకుపోయాడు. ఇది అనేక చేతులు దాటి చివరగా రష్యా 2వ కాథరీన్‌కు బహుకరించబడింది.

ఫ్రెంచి కిరీట ఆభరణాలలో గల వజ్రాలలో కొల్లూరులో లభించిన రీజెంట్ ఒకటి. ఇది నెపోలియన్ కత్తిపిడిలో పొదగబడింది. ఈనాడు ఇది పారిస్ లోవ్‌రే మ్యూజియంలో ఉంది. సుప్రసిద్ధ ఫ్లోరెంటైన్ వజ్రం భారత దేశంలో లభించింది. ఇది ఇప్పుడు ఆస్ట్రియన్ ఖజానాలో ఉంది.

కొల్లూర్‌లో లభించిన వజ్రం డైమండ్ ఆఫ్ డెత్ 'నీలి వజ్రం' శుభమైనది కాదు. దీనిని భారతదేశపు దేవాలయం నుంచి దొంగిలించిన ఒక ఫ్రెంచి యోధుని అడవి కుక్కలు చీల్చి చంపాయి. దీనిని కొన్న ఫ్రెంచి రాజు 14వ లూయీ వంశం పూర్తిగా నశించి పోయింది. 15వ లూయి అనేక కష్టాలను అనుభవించ వలసివచ్చింది. 16వ లూయీ, అతడి భార్య మేరీ ఆంటోయినెట్ ఫ్రెంచి విప్లవ సమయంలో ఉరితీయబడ్డారు

తరువాత దీనిని కొన్న ఆమ్‌స్టెర్‌డామ్ (నెదర్లాండ్స్) వర్తకుడు ఆత్మహత్య చేసుకున్నాడు. దీనిని ధరించిన లార్డ్ హోప్ ధనహీనుడై పోయాడు. కుదరని రోగంతో మరణించాడు. దీనిని కొన్న న్యూయార్క్ నగల వర్తకుడు పూర్తిగా నష్టపోయాడు. తరువాత దీనిని గ్రహించిన సుల్తాన్ అబ్దుల్ హమీద్ సింహాసనం పోయింది. మరణం సంభవించింది. తరువాత

(మిగతా 28 వ పేజీలో)

( 16 వ పేజీ తరువాయి)

అధ్యయనం సార్థకమవుతుంది. ప్రతీ సెకండరీ పాఠశాలలోను ఒక జాగ్రఫీ గదిని అభివృద్ధి చేయాలి. లాబొరేటరీలో విజ్ఞాన శాస్త్ర పరిశోధకుని వలె జాగ్రఫీ చరిత్ర చదువుకునేవారు పరికరాలను ఉపయోగించాలి. విద్యార్థులు ప్రయోగ పూర్వకంగా జాగ్రఫీ అధ్యయనం చేయాలి. ప్రదర్శనలు ఏర్పాటు చేయాలి.

ప్రకృతి శాస్త్రాలకు, మానవ నిర్మిత శాస్త్రాలకు మధ్య జాగ్రఫీ ఒక ప్రత్యేక మార్గము. దాని ప్రాముఖ్యత దానికి ఉంది. ●

"కుంటివానివద్ద నడక నేర్వడం కుదరదు."

# ఔషధ ప్రపంచం

## తేలుకాటుకి ప్రకృతి చికిత్స

భారతదేశంలో వైజ్ఞానిక శాస్త్రజ్ఞులు తేలు కాటుకి అమోఘంగా పనిచేసే అపూర్వమైన మందును తెలుసుకున్నారు. వృక్షశాస్త్రంలో కానవాలియా విరోసా (Canavalia virosa), హిందీలో బారాసెమ్ అని చెప్పబడే మొక్క గింజలు పై తొక్కతీసి కుట్టిన చోట పెడితే ఇవి అక్కడ చర్మానికి విషం హరించే దాకా అంటుకుంటాయి. విషం హరించిన వెంటనే ఇవి పడిపోతాయి. మధ్యప్రదేశ్ బస్తారులో కొండజాతులు దీనిని చాలాకాలం నుంచీ ఉపయోగిస్తున్నారు

* * *

## సంపర్క రహితమైన రోగనిదానం

యుఎస్ఎస్ఆర్ పెన్‌జా(Penza)లో మనస్తత్వ శాస్త్రజ్ఞులు సంపర్క రహితమైన రోగనిదాన సాధనం(Contactless diagnostics) కనుగొన్నారు. ఇది బయోప్లాస్మా చర్యపై ఆధారపడి ఉంటుంది 200మంది రోగులలో 90 శాతం రోగాలు ఏపొరపాటు లేకుండా తెలుసుకోబడ్డాయి. ఈసాధన సహాయంతో బ్లడ్‌ప్రెషరు, నాడీ మరియు శ్వాస రేట్లు కూడా తెలుసుకోవచ్చు. ఈ సాధనంలో బయో ప్లాస్మా జనరేటరు, డయాగ్నోస్టిక్ (రోగనిదాన) యూనిట్ ఉంటాయి. డయాగ్నోస్టిక్ యూనిట్ రోగి వివిధాంగాలు చేసే పనులు, పూర్తి అంగ నిర్మాణం చేస్తున్న పనులను గురించిన సమాచారం అందుకుంటుంది. రోగులకు కష్ట మనిపించే తెన్నులు, ఇతర బాదర బందీలు ఉండవు.

* * *

## లివరు సంబంధమైన రోగాలకు క్రొత్తరకం చికిత్స

మాస్కో సెంట్రల్ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్ గాస్ట్రో ఎంటిరాలజీ విభాగంలో క్రొత్తగా కనిపెట్టబడిన లివర్ చికిత్సా విధానం వల్ల మారకపు రేటు 30శాతానికి బాగా తగ్గిపోయింది. సోవియట్ వైద్యులు ప్రతిపాదించిన ఈ విధానంలో వేరుచేబడిన దోనారు లివరు కణాలను రోగి శరీరంలోకి ప్రవేశింపజేస్తారు. ఈ దోనారు కణాలు శరీరంలో జీవకణాలవృద్ధికి, ప్రొటీనుల సంయోజనకు తోడ్పడతాయి. అంటే ఆరోగ్యకరమైన లివరు చేసేపని చేస్తాయి. రోగి లివరు బాగుపడి సక్రమంగా పని చేసే దాకా ఇవి రోగి శరీరంలో ఉంటాయి. తరువాత లివరు ఈకణాలను నశింపచేస్తుంది.

## పెంగ్విన్ నీటిలో 266 మీటర్ల లోతువరకు ఈదగలదు



పెంగ్విన్ పక్షులు నీటిలో 266 మీటర్ల లోతు వరకు ఈది అక్కడ 18 నిమిషాలపాటు ఉండగలవు

"కారణం లేకుండా కార్యం కలుగదు."

# మూలద్రవ్యము - హీలియం

మొట్టమొదట హీలియంను ఉపయోగించిన వారు జర్మనులు. గ్రహణ సమయంలో సూర్యకాంతి మండలం (Solar corona) స్పెక్ట్రమ్‌ను పరీక్షించేటప్పుడు ఖగోళ శాస్త్రజ్ఞులు 1868లో దీనిని కనుగొన్నారు. అందుచేతే దీనికి సూర్యుని సంబంధమైన హీలియం అనేపేరు పెట్టారు.

భూమిమీద హీలియం మొదట 1881 లో కనుగొనబడింది. ఇది చాలా అపురూపంగా లభించడం వల్ల, లభించినా అతి శీఘ్రంగా హరించిపోవడం వల్ల, దీనిపై రసాయనిక చర్యలు ఏవీ కలుగకపోవడం చేత శాస్త్రజ్ఞులకు దీనిపై అంత శ్రద్ధ ఏర్పడలేదు.

ఇది భూమి మీద కనిపెట్టబడిన తరువాత 34 సంవత్సరాలకు దీని ప్రయోజనాన్ని తెలుసుకున్నారు. దీనిని ప్రప్రథమంగా ఉపయోగించిన వారు జర్మనులు. వీరు దీనిని యుద్ధాలలో వాడడం ప్రారంభించి, 1915లో దీనిని విమానాలలో తీసుకువెళ్ళి లండన్ నగరాన్ని బాంబుచేసారు.

ఈనాడు హీలియమ్‌కు అనేక ఉపయోగాలు ఉన్నాయి. ఎటామిక్ రియాక్టర్లలోను, ఇతర హెర్మిటిక్ (సీలుచేసే) విధానంలోను లీకేజి ఉందా లేదా అని తెలుసుకోడానికి దీనిని ఉపయోగిస్తారు. సెమీకండక్టర్ వస్తువులైన సిలికాన్ మరియు జెర్మేనియమ్ మోనో క్రిస్టల్స్ హీలియం వాతావరణంలో తయారుచేయబడుతున్నాయి. దీనివల్లే ఎలక్ట్రానిక్స్‌లో హీలియం అనివార్యమైంది. ద్రవరూపంలో హీలియం ఉష్ణోగ్రత అనేక లోహాలను, అలాయిలను సూపర్ కండక్టివ్‌గా చేస్తుంది క్రయోట్రాన్స్ (cryotrons) అని చెప్పబడే సూపర్ కండక్టర్ రిలేలు ఎలక్ట్రానిక్ కంప్యూటర్లలో వినియోగపడుతున్నాయి. విద్యుత్ రంగంలో హీలియంకు బహుళార్థ ప్రయోజనం ఉంటుంది.

మెటర్నిటీ హాస్పిటళ్ల (ప్రసూతి వైద్య శాలలు) లో నెలలు తక్కువ బిడ్డలు నైట్రోజన్‌కు బదులుగా హీలియం చేర్చిన గాలిని పీల్చుకునేటట్టు చేస్తారు. దగ్గు, ఒగర్పు, ఉబ్బసం రోగంతో భాదపడేవారికి హీలియం అధికంగా చేరిన గాలిని పీల్చడం వల్ల ఉపశమనం కలుగుతుంది. చాలాకాలం పాటు అంతరిక్ష ప్రయాణం చేసే వ్యోమగాములకు (cosmonauts)కి హీలియం అధికం చేరిన గాలి వల్ల వాతావరణం అనుకూలవంతంగా ఉంటుందని బయాలజిస్టులు తెలుసుకున్నారు

హీలియం వాతావరణంలో నిల్వచేసిన ఆహారవస్తువులు, వాటి అసలైన రుచి, కమ్మదనం, వాసన చెడకుండా ఉంటాయని తెలుసుకున్నారు.

## స్త్రీలను గౌరవించండి



స్త్రీలను గౌరవించే అన్ని దేశాలు అభివృద్ధి పొందాయి. స్త్రీలు పూజింపబడని రాజ్యము, దేశము అభివృద్ధి పొందలేదు. ఇక ముందు అభివృద్ధిని పొందలేవు. స్త్రీలు గౌరవింపబడని కుటుంబంగానీ దేశంగానీ పైకి రాలేదు. అందుకే స్త్రీ జనోద్ధరణ ప్రథమ కర్తవ్యం.

— స్వామి వివేకానంద

"లేనివస్తువుని ఊహించడం ప్రారంభిస్తే
పలువురు పలురకాలుగా పలకడం సహజం."

అయినా 'హీలియం ప్రిజర్వ్లు' ఒక భావ కల్పన. ఇంతవరకు కూడా ఈ మూలపదార్థం చాలా అపురూపంగా ఉంది. ఎక్కడైనా ఇక తప్పనిసరి అనిపిస్తేనే దీనిని వాడతారు. మూలపదార్థాలలో రెండవదిగా పరిగణించబడ్డ హీలియం విశ్వాంతరాళంలో లభించే అవకాశం కూడా రెండవదే. భూమి మీద ఇది మిక్కిలి తక్కువగా ఉంది. ఒక కిలోగ్రాం ద్రవ్యంలో 0.003 మిల్లీ గ్రాములు మాత్రమే లభిస్తుంది. దీనిని పొందడం అంత సులభంకాదు.

స్వచ్ఛమైన హీలియం నిధులు ఎక్కడా లేవు. సహజమైన గాసులలో తక్కువగా చేరి ఉంటుంది - వెయ్యోవంతు, నూరోవంతు తరచుగా 1 శాతంలో పదవవంతు.

సహజమైన గాస్‌లో గల హీలియంను సేకరించుకోవాలి. దీన్ని జాగ్రత్త పెట్టడం బ్రహ్మాండం. మామూలుగా పట్టి ఉంచే గాస్ సిలిండర్లలో పెట్టినా గాలితో కలిసిపోతుంది.

ప్రపంచ వ్యాప్తంగా ఒక ఘనమీటరు హీలియం పొందగలిగితే నిరర్థకంగా 20 ఘనమీటర్లు పొగ గొట్టం ద్వారా ఎగిరి పోతుంది కొలుములలో సహజ వాయువులు మండేటప్పుడు కూడా ఇది సంభవిస్తుంది. వచ్చినతంటా హీలియం వాతావరణంలోకే జారిపోతుంది. ఇది తటస్థమైనది-దానిపై రసాయనిక చర్యలేమీ ఉండవు. మిక్కిలి తేలికగా ఉండటం చేత ఆకాశంలోకి పోతుంది.

అయినప్పటికీ భూగర్భంలో హీలియం నిరంతరం పుడుతూనే ఉంటుంది భూగ్రహం మీద రేడియో ఆక్టివ్ మూలవస్తువులే దీనికి ఆధారం. చాలా మెల్లిగా ఏర్పడుతూ ఎప్పటి కప్పుడు ఏర్పడిన క్రొత్త హీలియం చుట్టు ప్రక్కల రాళ్లలోను, శిలలలోను చేరి పోతుంది.

భూమి మీద రెండవ మూలపదార్థమైన హీలియం వనరులు $5 \times 10^{14}$ ఘన మీటర్లు అని అంచనా వేయబడింది. భూమి ఏర్పడిన తరువాత దీనికి అనేకరెట్లు తయారైంది. చాలామటుకు హీలియం భూమి మీద లేకుండా హరించి పోయింది. సహజమైన గాసుల నుండి దీనిని లభింప చేసుకుని నిల్వ చేసుకోడం ముఖ్యం

— 'స్పుట్‌నిక్' సౌజన్యంతో

## భూమిమీద 35 శాతం పంట భూములు ఎడారులుగా మారిపోతున్నాయి



ఎడారిగా మారటం అనే దృగ్విషయం వల్ల ప్రపంచంలో పంట భూములు అధికభాగం ఎడారులై పోతున్నాయి. ఎడారిగా మారటం వల్ల ప్రత్యక్షంగా ప్రపంచ దేశాలలో మూడోవంతు రెండువందలు మరియు ప్రతి 7 మందికి ఒకరు నష్టపోతున్నారు. 1984 లో యునైటెడ్ నేషన్స్ అంచనా ప్రకారం ప్రపంచంలో భూమిమీద 35 శాతం పంటభూములన్నీ ఎడారిగా మారిపోతూ భయంకర పరిస్థితులు ఏర్పడుతున్నాయని, ప్రపంచ జనాభాలో 10 శాతం ఎడారులవల్ల నష్టపోయారని కూడా తేలింది.

—లోవెల్ ఎస్ హాగ్సర్ జూనియర్
ప్లెయిన్ ట్రూత్ సౌజన్యంతో

"పదహారు కళలతో నిండిన పూర్ణచంద్రునిలోని మచ్చ పరిగణనకు రాదు."

# మీకు తెలుసా?

## ఎడ్వర్డ్ జెన్నర్ టీకాల మందు కనిపెట్టాడు

బ్రిటిష్ వైజ్ఞానిక శాస్త్రవేత్త ఎడ్వర్డ్ జెన్నర్ (1749-1823) టీకాల మందును మొట్ట



EDWARD JENNER

మొదట కనిపెట్టాడు. రోగనిరోధక భావాన్ని రుజువు చేశాడు. మశూచికి రోగనిరోధక శక్తిని ప్రత్యక్షంగా ప్రదర్శించాడు.

* * *

## న్యూజిలాండులో గెయిజర్లు

న్యూజిలాండ్ గెయిజర్లకు (Geysers) చాలా ప్రసిద్ధి పొందింది. భూగర్భం నుంచి వేడినీటిని, ఆవిరిని గాలిలోకి పైకి తన్నే వేడినీటి బుగ్గలు గెయ్‌జర్లు.

* * *

## రైలుదారుల మైలేజి యుఎస్ఎ లో అత్యధికం

యుఎస్ఎలో రైలుదారుల మొత్తం మైలేజి చాలా అధికం. సుమారు 3,68,000 కి.మీలు. ఇది ప్రపంచంలో ఉన్న మొత్తం 11,20,000 కి.మీల మైలేజిలో మూడవ వంతు.

* * *

## యుఎస్ పోస్టల్ సర్వీసు 1970లో ఏర్పడింది

యునైటెడ్ స్టేట్స్‌లో స్వతంత్ర ప్రభుత్వ సంస్థగా 1970లో ఏర్పడిన యుఎస్ పోస్టల్ సర్వీసు తపాలా విధానాన్ని నిర్వహిస్తుంది.

* * *

## ప్రపంచంలో మిక్కిలి ప్రాచీనమైన బ్రాడ్ కాస్టింగ్ సంస్థ-బిబిసి

బ్రిటిష్ బ్రాడ్ కాస్టింగ్ కార్పొరేషన్ (BBC) ప్రపంచంలో మిక్కిలి ప్రాచీనమైన బ్రాడ్‌కాస్టింగ్ సంస్థ. ఇది 1922లో మొదట ఒక కంపెనీగా ప్రారంభింపబడింది. ప్రస్తుతం బిబిసి ప్రపంచం అంతటా 50 భాషలలో బ్రాడ్‌కాస్ట్ చేస్తుంది.

* * *

### పొడుపు కథలు

1. మల్లెపూలు విరగబూసాయి కానీ ఎవరూ కోయలేరు.
2. అందగాడైన రాజు వచ్చినా ఎవరూ చూడరు.
3. ఎర్రని చెట్టు నీళ్ళుపోస్తే చస్తుంది.
4. చూడ చిన్నదే కానీ దానికి కట్టిన తాడు మాత్రం పెద్దది.

జవాబులు

1. నక్షత్రాలు 2. చంద్రుడు అమావాస్య 3. అగ్ని 4. సూది దారం

"తిన్నతిండి జీర్ణమైన తరువాత తింటూంటే మందుమాకుల అవసరం ఉండదు."

## న్యూజిలాండులో ఎత్తైన పర్వతము

న్యూజిలాండ్‌లో మిక్కిలి ఎత్తైన పర్వతము 3402 మీటర్ల మౌంట్ కుక్.

* * *

## మోంట్ బ్లాంక్ క్రింద 11 కి.మీల పొడవైన సొరంగము

ఆల్ప్స్ పర్వతశ్రేణిలో మోంట్ బ్లాంక్ (Mont Blanc) క్రింద పెద్ద సొరంగం ఉంది. ఇది11 కి.మీ ల పొడవుతో ఫ్రాన్స్‌ను ఇటలీతో కలుపుతుంది.

* * *

## సినీమా చరిత్రలో మొట్ట మొదటి టాకీ

సినీమా చరిత్రలో 'ది జాగ్ సింగర్' అనేది మొట్ట మొదటి టాకీ ఫిల్ము. ఆల్ జోల్‌సన్ (Al Jolson) నటించిన ఈసినీమా 1928లో తీయబడింది

* * *

## శబ్దావరోధాన్ని అధిగమించిన మొట్టమొదటి వ్యక్తి

గాలిలో శబ్దావరోధాన్ని అధిగమించిన మొట్ట మొదటి వ్యక్తి ఎయిర్ కమ్మోడోర్ డొనాల్డ్ సన్. 1946లో ఇతడు మీటియార్ జెట్‌తో దీనిని సాధించాడు.

* * *

## ప్రపంచంలో మిక్కిలి ఎత్తైనచర్చి

ప.జర్మనీలో ఉల్మ్ కెథిడ్రల్ ప్రపంచంలో మిక్కిలి ఎత్తైన చర్చి.

* * *

## రాకెట్ శక్తితో ఎగిరే విమానాన్ని నడిపిన మొదటి మహిళ

రెండవ ప్రపంచ యుద్ధపు చివరి రోజులలో రాకెట్ శక్తితో ఎగిరే విమానాన్ని నడిపిన మొట్టమొదటి మహిళ జర్మనీ దేశస్థురాలైన హన్నారీట్స్ (Hanna Reitsch).

* * *

## ప్రపంచంలో మిక్కిలి దీర్ఘమైన వాహనం

ప్రపంచంలో భూమి మీద మిక్కిలి దీర్ఘమైన వాహనం - 54 చక్రాల "ఆర్కిటిక్ స్నో ట్రెయిన్" యునైటెడ్ స్టేట్స్ ఆర్మీ కొరకు నిర్మించ బడింది. దీని నిడివి 174.3 మీటర్లు.

* * *

## వెల్లింగ్‌టన్ బూట్స్ అంటే ఏమిటి?

మోకాళ్ళ వరకు ఉండే రబ్బరు బూట్లను వెల్లింగ్‌టన్ బూట్స్ అంటారు. వీటికి మొదట డ్యూక్ ఆఫ్ వెల్లింగ్‌టన్ (1769-1852) పేరు పెట్టారు.

* * *

## కాష్ ఆన్ డెలివరీ

వస్తువులను ఆర్డర్ చేసి అవి అందిన తరువాత సొమ్ము చెల్లించే పద్ధతిని "కాష్ ఆన్ డెలివరీ" అంటారు.

* * *

**"ఆకలి అయినప్పుడు తినేవాడు ఆరోగ్యాన్ని సమీపిస్తే, అధికంగా తినేవాడు వ్యాధిని సమీపిస్తాడు."**

## సూర్యుని భారం తగ్గిపోతూంది

సూర్యుని భారం సెకండుకి 1,000,000 టన్నులు తరిగి పోతూందని అంచనా వేయబడింది.

* * *

## గడ్డిలో 4,000 రకాలు

గడ్డిలో 4,000 పైబడిన రకాలు ఉన్నాయి. వీటిలో గోధుమ, బార్లీ, వరి, ఓట్సు, వెదురు, చెరకు వంటివి కూడా చేరి ఉంటాయి.

* * *

## 'బ్లూ తిమింగిలం' 3 టన్నుల ఆహారం తింటుంది

'బ్లూ తిమింగిలం' రోజుకి 3 టన్నుల ఆహారం తింటుంది. దీనికి బరువెక్కిపోతుందనే భయం ఉండదు.

* * *

## 'పీలీ' అసలుపేరు

సుప్రసిద్ధ బ్రెజీల్ ఫుట్‌బాల్ ఆటగాడు మరియు ఫార్‌వర్డ్స్ ఎవర్ అయిన పీలీ అసలుపేరు ఎడ్సన్ అరాంటెస్ డొనాస్సిమెంటో

* * *

## మిక్కిలి పెద్ద వేరుగల మొక్క

గుమ్మడి పాదులకు చిన్న చిన్న వ్రేళ్లు (Rootlets) 15 మైళ్లు విస్తరించుకుని ఉంటాయి కాబట్టి ఇవే మిక్కిలి పెద్ద వేరుగల మొక్క.

* * *

## ఎఫిల్ టవర్‌కి 2,500,000 రివెట్లు

పారిస్ (ఫ్రాన్స్) లో ఉన్న ఎఫిల్‌టవర్ 2,500,000 రివెట్లున్నాయి.

* * *

## టోకియోలో ఖర్చు అధికం

ప్రపంచ ముఖ్యపట్టణాలన్నిటిలో జపాన ముఖ్య పట్టణమైన టోకియోలో ఖర్చు మిక్కిలి అధికంగా అవుతుంది.

## పరిపూర్ణ సౌందర్యమే పరమాత్ముడు



సౌందర్యం అనంతమైనది. దానికి అవధి అనేది లేదు. పరిపూర్ణ సౌందర్యమే పరమాత్ముడు. సౌందర్యం ప్రేమ యొక్క శోభ, కాంతి లావణ్యము, మాధుర్యం దాని సహజలక్షణములు. పరమాత్ముని సాన్నిధ్యంలో ఆనందిస్తూంటే వాస్తవిక సౌందర్యానుభూతి కలుగుతుంది. శోభాయమానమైన గుబాళింపులతో వికసించిన గులాబులు ఇటువంటి దివ్యతత్త్వాన్ని ప్రకటిస్తాయి.

"జాతి ఛండాలునకు సత్కర్మవలన ముక్తి లభించును,
గుణ ఛండాలునికి కోటి జన్మలకైనా ముక్తి లభించదు."

# నిద్ర - కొన్ని క్రొత్త విషయాలు

కొంత మందికి అనుకుంటే వెంటనే నిద్ర వచ్చేస్తుంది అమెరికా ప్రెసిడెంట్ జాన్.ఎఫ్ కెన్నడీ అటువంటి వ్యక్తి. మరి కొంత మంది రోజుల కొద్దీ ఏ బాధలు లేకుండా కునుకు లేకుండా మేల్కొని ఉండగలరు. జపాన్ బౌద్ధ ఆశ్రమంలో భక్తులు ఒకే సమంగా17గంటల సేపు ధ్యానం చేస్తారు. అయిదు రోజుల వరకూ నిద్ర లేకుండా ఉంటారు



యోగులు కొంతమంది గుండె కొట్టుకో కుండా చేసుకోగలరు శరీరంలో గుచ్చుకో కుండా మేకుల మీద కూర్చోగలరు అటువంటి వాళ్ళు వాస్తవంగా గుండెను ఆపటంలేదు ప్రతీసారీ ఊపిరితిత్తులను విస్తరింప చేయడం వల్ల గుండె కొట్టుకునే ప్రమాణం తగ్గుతుంది బాధ కలుగకుండా స్వేచ్ఛా నియంత్రణ మానసిక శక్తిపై ఆధారపడి ఉంటుంది. ఇది పూర్తిగా తెలిసికొన బడలేదు కానీ జపాన్‌లో ధ్యానావస్థలో ఉండే బౌద్ధ సన్యాసుల మెదడులో తరంగాలు ప్రత్యేక తీరులో ఉన్నాయి. ఇవి వారి అపూర్వ నిగ్రహ శక్తిని తెలుసుకోడానికి కొన్ని రహస్యాలను తెలియ జేస్తాయి

స్విట్జర్లాండ్ బాసెల్ యూనివర్శిటీ వైద్యులు నిద్రపోతున్న కుందేలు మెదడు నుండి కొంత రక్తాన్ని గ్రహించి మెళకువుగా ఉన్న జంతువుకు ఇంజక్షను చేశారు వెంటనే అది నిద్రలోకి దిగిపోయింది. మెదడులో రక్తానికి గల నిద్రశక్తిని తెలుసుకోడానికి ఇదే ప్రారంభ దశ రసాయనిక ద్రవ్యంగా దీనిని ఉత్పాదించి సహజమైన గాఢ నిద్రను కలిగించవచ్చు

నార్కొలెప్సీ (Narcolepsy)అనేది ఆపుకో లేకుండా కళ్ళు మూసుకుపోవడం. ఇది పిడు గులా సంభవిస్తుంది. ఒక స్త్రీ తన స్నేహితు రాలితో మాట్లాడుతూనే ఉంటుంది మరుక్షణం నిద్రపోతుంది. నడిచేటప్పుడు, కారునడిపే టప్పుడు ఇటువంటి వాళ్ళు కునుకుపాట్లలోకి దిగిపోతారు. పకపకా నవ్వు, కోపంవల్ల కూడా నిద్రమత్తు వస్తుంది. ఎంతో మంది తమకు నార్కొలెప్సీ ఉందని తెలుసుకోకుండానే రోడ్ల మీద నిద్రమత్తుతో నడుస్తూంటారు.

ఇటువంటి కునికి పాట్లు తరచు వస్తుంటే వైద్యుని సలహా తీసుకోవాలి ఇటువంటివారు కారులను నడిపేటప్పుడు, మెషీనుల దగ్గర జాగ్రత్తగా మసలు కోవాలి!

## ప్రపంచంలో మిక్కిలి ప్రాచీనమైన లైబ్రరీ

ఇరాక్ పురావస్తు శాస్త్రజ్ఞులు బాగ్దాదు దగ్గర సైపార్ నగరంలో బైబిల్ యుగంలో ప్రళయానికి పూర్వపు చరిత్రాంశాలలో చెప్పబడిన ప్రాచీన లైబ్రరీ ఒకదానిని కనుగొన్నారు. బి. సి. 6వ శతాబ్దానికి చెందిన ఈ పురాతన లైబ్రరీలో మిస్ మారక్ (Mismank) లిపిలో వ్రాయబడిన 2,000 మట్టి పలకలు భద్రపరచబడి ఉన్నాయి

"సచ్ఛీల సంపదగలవ్యక్తికి దారిద్ర్యము అవమాన హేతువు కాదు."

# మన రాష్ట్రాలు

## గుజరాత్

పశ్చిమ భారతదేశంలో గుజరాత్ వైశాల్యంలో 7వ పెద్ద రాష్ట్రం జనాభాను బట్టి 9వ స్థానాన్ని ఆక్రమిస్తూంది. బొంబాయి రాష్ట్రంలో ముఖ్యంగా గుజరాతీ మాట్లాడుకునే పశ్చిమ ఉత్తర భాగాలు చేరి గుజరాత్ ఏర్పడింది. మహారాష్ట్రం మాట్లాడుకునే మిగతా భాగం మహారాష్ట్ర అయింది ఆనాడు ఉమ్మడి రాష్ట్రాలకు రాజధాని నగరంగా ఉన్న బొంబాయి మహారాష్ట్రకు రాజధాని అయింది. గుజరాత్‌కి అహమ్మదాబాద్ రాజధాని అయింది ఇప్పుడు గుజరాత్ రాజధాని క్రొత్తగా నిర్మింపబడిన గాంధీనగర్ ఇది అహమ్మదాబాద్‌కు 32 కి మీ.లు ఉత్తర దిక్కుగా సబర్మతి నదికి పశ్చిమ గట్టున ఉంది.




బ్రిటిష రాజ్యాంగంలో తమ సౌకర్యార్థమ్ము బ్రిటిషు పాలకులు గుజరాత్‌ను చిన్న చిన్న సంస్థానాలుగా ఏర్పరచారు. 1947లో స్వాతంత్ర్యానంతరం గుజరాత్‌లో సంస్థానాలు అన్నీ గుజరాత్‌తో సమైక్యమై ఒకే పాలనలో ఉన్నాయి. 1960 వ సంవత్సరపు బొంబాయి రీఆర్గనైజేషన్ చట్టం ప్రకారం బొంబాయి రాష్ట్రం మే 1,1960న మహారాష్ట్ర మరియు గుజరాత్‌గా విడిపోయినప్పుడు క్రొత్త గుజరాత్ రాష్ట్రం ఏర్పడింది

గుజరాత్ వైశాల్యం 1,95,984 చ.కి మీ లు జనాభా 3,40,86,000 జనసాంద్రత చ కి మీ కి 173 అక్షరాస్యత 43 75 శాతం




గుజరాత్‌లో 19 జిల్లాలు ఉన్నాయి. ఎన్నుకోబడిన 182 మంది సభ్యులతో ఇక్కడ లెజిస్లేటివ్ అసెంబ్లీ ఏకైక పాలకవర్గము హైకోర్టు అహమ్మదాబాద్‌లో నిర్వహింపబడుతూంది.

గుజరాతీ అధికార భాష హిందీ, ఇంగ్లీషు, మరాఠీ ఇతర ముఖ్యభాషలు. ఇక్కడ ముఖ్య మతస్థులు హిందువులు, జైనులు, మహమ్మదీయులు, క్రైస్తవులు మరియు పార్శీలు. గుజరాత్‌లో ఆదిమవాసులు మొత్తం జనాభాలో 15 శాతం ఉంటారు

బానాస్, డామన్‌గంగ, మాహి, సబర్మతి; షెత్రుంజి, తపతి, లూనీ, నర్మద, సరస్వతి

"ప్రేమ రహితులైన వారి జీవితం చవిటి నేలలో వట్టిపోయిన చెట్టు చిగురించినట్లుంటుంది."

మరియు విశ్వామిత్రి నదీజలాలు గుజరాత్ మైదానాలకు ముఖ్యమైన నీటివసతి కల్పిస్తు న్నాయి. ఈ నదులన్నీ వర్షాధారవు నదులు ఇక్కడ వర్షపాతము 65 మరియు 127 సెం మీల మధ్య ఉంటుంది.

గుజరాత్‌లో ఉప్పు, సున్నపురాయి, మాంగ నీసు, జిప్సం, చైనాక్లే, కాల్సైట్, బాక్సైట్ వంటి ఖనిజాలు లభిస్తాయి బాక్సైట్, ఫ్లోరైట్, సున్న పురాయి, లిగ్నైట్, గాజు, ఇసుక వనరులు గుజరాత్‌లో విస్తారంగా ఉన్నాయి. గుజరాత్ మొత్తం భూప్రదేశంలో 10 05 శాతం అడవు లతో నిండి ఉంటుంది సామాజ అడవుల పెంపకం ఇక్కడే ప్రారంభమైంది గుజరాత్‌లో



Shaking Minarets

నాలుగు జాతీయ పార్కులు, 11 సాంక్చురీలు ఉన్నాయి.

గుజరాత్‌లో 60 శాతం పైబడి జనాభాకు వ్యవసాయమే ముఖ్యవృత్తి ఇచ్చట సాగుబ డిలో మూడవవంతు బాజ్రా ఇదే ముఖ్యమైన పంట రాష్ట్రంలో ఇతర ఆహారధాన్యాల ఉత్ప త్తిలో 5వ వంతు గోధుమ రాష్ట్రంలో వరి, జోవర్, జొన్న ఇతర ముఖ్యమైన ఆహార ధాన్యపు పంటలు.

దేశంలో లభించే అతి సున్నితమైన ప్రత్తి రకాలు గుజరాత్‌లో పండిస్తారు దేశం మొత్తంమీద ప్రత్తిపంట వ్యవసాయంలో 20 శాతం సాగుబడి ఇక్కడ జరుగుతుంది దేశంలో లభ్యమయ్యే వేరుశనగలో 30 శాతం గుజరాత్‌లోనే పండుతుంది చివరగా దేశంలో లభ్యమయ్యే పొగాకులో 15 శాతం పొగాకు ఇక్కడే పండుతుంది



దేశపు పాడి పరిశ్రమరంగంలో గుజరాత్ ముఖ్యస్థానం ఆక్రమిస్తూంది. సుమారు 12,000 చ.కి.మీల సముద్ర ప్రదేశంలో మత్స్య పరిశ్రమ విరివిగా జరుగుతుంది.

స్వాతంత్ర్యానంతరం అనేక నీటి పారుదల ప్రాజెక్టులు పూర్తికావింపబడ్డాయి కెల్-డెజెర్ దగ్గర దోరై మరియు పనామ్‌వద్ద సబర్మతి నదికి రిజర్వాయర్లు నిర్మింపబడ్డాయి.

## ప్రపంచంలో మొట్టమొదటి ఫింగర్ ప్రింట్ బ్యూరో

వేలి ముద్రల పరిశోధక కేంద్రం జూన్ 1897లో కలకత్తాలో రైటర్స్ బిల్డింగ్‌లో స్థాపింపబడింది. అదేసంవత్సరమే జల్‌పాయ్‌గురిలో టీ తోటల స్వంతదారుని హత్యచేసిన కాలీచరన్ అనే హంతకుడు ప్రపంచంలో మొట్టమొదటి వ్రేలిముద్ర సాక్ష్యంతో నేరస్థుడుగా నిరూపించబడ్డాడు.

"నిప్పువల్ల ఏర్పడిన పుండు సులభంగా మానిపోతుంది నాలుకవల్ల ఏర్పడ్డ పుండు ఎప్పటికీ మానదు."

సూరత్ దగ్గరగా ఉకాయ్ వద్ద జలవిద్యుత్ కేంద్రం స్థాపింపబడింది. ధువారన్ వద్ద థెర్మల్ స్టేషన్ చాలా ముఖ్యమైనది. రాష్ట్రానికి అవసరమైన విద్యుచ్ఛక్తిలో సగానికి సగం మహారాష్ట్ర మరియు గుజరాత్ సరిహద్దు ప్రాంతాలలో ఉన్న తారాపూర్ అటామిక్ పవర్ స్టేషను నుంచి లభిస్తూంది.


SARDAR PATEL

బట్టలు, రసాయనిక పదార్థాలు, పెట్రోకెమికల్స్ మరియు ఔషధాలు, శాకా సంబంధమైన నూనెలు, ఎలక్ట్రానిక్ మరియు ఎలక్ట్రికల్ పరికరాలు, వర్ణ ద్రవ్యాలు, ఇంజనీరింగ్ వస్తువులు, మెషీన్ టూల్స్, సిమెంట్, చక్కెర మొదలైనవి గుజరాత్ రాష్ట్రంలో కొన్ని ముఖ్యమైన పరిశ్రమలు. దేశానికి అవసరమైన మొత్తం ఉప్పులో 60 శాతం ఇక్కడ ఉత్పత్తి అవుతుంది. అంక్‌లేశ్వర్, కాంబే, కాలోల్ ప్రదేశాలలో నూనె మరియు సహజవాయువుల అన్వేషణ, ఉత్పాదన జరుగుతూంది. దేశంలో మిక్కిలి పెద్ద పెట్రోకెమికల్ కాంప్లెక్స్ బరోడాలో నిర్మింపబడింది. కొయాలీలో ఆయిల్ రిఫైనరీ ప్రారంభించిన తరువాత ఇక్కడ పెట్రోకెమికల్ పరిశ్రమలు అభివృద్ధి చెందుతున్నాయి.

ఆరు పెద్దపెద్ద సిమెంట్ ఫ్యాక్టరీలతో దేశంలో 10 శాతం సిమెంటును గుజరాత్ ఉత్పాదిస్తుంది హుయి ప్రదేశంలో నత్రజని ఎరువుల ఉత్పాదన కొనసాగుతూంది బారుచ్ దగ్గర గుజరాత్ నర్మదా వాలీ ఫెర్టిలైజర్ కంపెనీ గొప్ప విజయాన్ని సాధించింది దేశానికి అవసరమైన పిల్లల పాలు 63 శాతం, పాలపొడి 47 శాతం ఇక్కడే ఉత్పాదింపబడుతూంది ఆనంద్‌లో 'ది అమూల్ కో ఆపరేటివ్ డైరీ' క్షీర సంబంధమైన ఉత్పాదనలకు ప్రసిద్ధి పొందింది.

నేడు గుజరాత్‌లో 70,000 పైబడిన లఘు పరిశ్రమలు ఉన్నాయి. 1328 నూలు మిల్లులతో చేరి మొత్తం 13,000 ఫాక్టరీలు ఉన్నాయి రాష్ట్రంలో 167 పారిశ్రామిక వాడలు ఉన్నాయి

( 18 వ పేజీ తరువాయి)

దీనిని ధరించిన ఒక నటి స్టేజిమీద చంపబడింది 3,00,000డాలర్లు వెచ్చించి దీనిని కొన్న ఒక గనిస్వంతదారుడు విషం త్రాగి ఆత్మహత్య చేసుకున్నాడు. ఈనాడు ఈ వజ్రం వాషింగ్‌టన్ DC (యుఎస్ఎ) స్మిత్ సోనియన్ ఇన్‌స్టిట్యూట్‌లో ఉంది.

అపురూపమైన రంగులలో మిక్కిలి పెద్ద వజ్రం 'బ్లడ్ రెడ్' 5 05కారెట్లు నిర్దోషమైన ఈవజ్రం 1927లో దక్షిణ ఆఫ్రికాలో టిక్ టెన్‌బర్గ్‌లో లభించింది ఇది ఇప్పుడు యుఎస్ఎలో ఒక అనధికార సేకరణలో ఉంది.

నిర్దోషమైన ముత్యం వంటి 85 91 కారెట్ల వజ్రాన్ని న్యూయార్క్ నగరంలో సోత్‌బైవారు లండన్‌కు చెందిన లారెన్స్ గాఫ్‌కు నవంబరు 19, 1988న అమ్మగా 9 1,30,000 డాలర్లు అత్యధికమైన ధర లభించింది

"భవవిభవము నిజమని యెంచగరాదు,
శివ మాధవ భేదము చేయగరాదు."

విద్యారంగంలో అహమ్మదాబాద్ మరియు ఇతర పెద్ద నగరాలలో అనేక యూనివర్శి టీలతో గుజరాత్ ప్రగతి పథంలో ఉంది.

గుజరాత్‌లో టూరిస్టులకు అనువైన ప్రదే శాలు అనేకం ఉన్నాయి బట్టల పరిశ్రమలకు ప్రసిద్ధిచెందిన అహమ్మదాబాద్ నగరంలో శిల్పాలతో అలంకరింపబడిన గొప్ప గొప్ప కట్ట డాలు ఎన్నో ఉన్నాయి. సిడీ బషీర్ మాస్క్‌లో షేకింగ్ మినారెట్లు అద్భుతంగా ఉంటాయి


K M. MUNSHI

ఒక శిఖరాన్ని కదిపితే రెండవ శిఖరం కూడా కదులుతుంది. అహమ్మదాబాద్‌లో 'ది ఇండి యన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మేనేజిమెంట్', 'ది నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ డిజైన్' మరియు 'గుజరాత్ స్కూల్ ఆఫ్ ఆర్కిటెక్చర్' చాలా ప్రసిద్ధి పొందినవి కాలికో మ్యూజియం, సంస్కారకేంద్రము, ప్రపంచ ప్రఖ్యాతి పొందిన శిల్పి లెకార్బుసీర్ రూపకల్పన చేసిన పాల్డీ మ్యూజియం, శ్రేయాస్ ఫోక్‌ఆర్ట్ మ్యూజియం చూడదగిన ఇతర ముఖ్యప్రదే శాలు

అహమ్మదాబాదు అద్దకాలకు, దేవాలయా లకు అవసరమైన చేతితో పెయింటు చేసిన బట్టలకి చాలా ప్రసిద్ధి చెందింది. అద్దాలు పెట్టి కుట్టిన బట్టలు, ఎంబ్రాయిడ రీలు, ఉన్ని శాలువలు, వెండి వస్తువులు దేశంలో ఉత్తమమైనవి ఇక్కడ లభిస్తాయి. అహమ్మదాబాద్‌లో మొత్తం 75 టెక్స్‌టైల్ మిల్లులు ఉన్నాయి. అహమ్మదాబాదులో గల అందమైన జైన దేవాలయాలలో ముఖ్యంగా చూడదగినది హథీసింగ్ దేవాలయం.

ఇక్కడ సూరత్, బరోడా, జామ్‌నగర్, రాజ్ కోట్ ఇతర పెద్దపెద్ద నగరాలు. సూరత్‌లో వెండి మరియు బంగారు జరీ తయారు చేస్తారు. పట్టు బట్టల నేత ఇక్కడ ఒక కుటీర పరిశ్రమగా ప్రవృద్ధి పొందింది. వజ్రాల కోత మరియొక మహాద్భుతమైన పరిశ్రమ

సౌరాష్ట్ర ద్వీపకల్పంలో జామ్‌నగర్ పట్టు బట్టలకు, ఉన్ని బట్టలకు టై అండ్ డై అద్దకపు బట్టలకు చాలా ప్రసిద్ధి పొందింది. ప్రఖ్యాతి పొందిన క్రికెట్ యోధుడు జామ్ సాహెబ్ రంజిత్ సిన్హ్‌జీ 1907 మరియు 1933 సంవ త్సరాల మధ్య జామ్‌నగర్ పాలకుడుగా ఉన్నారు. ఇచ్చట గల ఆయుర్వేదిక్ యూనివర్శిటీ భారతదేశంలో మిక్కిలి ప్రసిద్ధిపొందినది.

సౌరాష్ట్ర ద్వీపంలో రాజ్‌కోట్ అతిశీఘ్రంగా అభివృద్ధి పొందుతూన్న నగరము బరోడా (వాదోదరా)లో బ్రహ్మాండమైన రాజభవనాలు, మ్యూజియం, యూనివర్శిటీ చూడదగినవి ఇచ్చటి లక్ష్మీ విలాస్ పాలెస్ భారతదేశంలో మిక్కిలి సుందరమైనది

అరేబియా సముద్ర తీరం మీద సౌరాష్ట్ర ద్వీపకల్పంలో ద్వారకలో సుమారు 3,400 సంవత్సరాలకు పూర్వం శ్రీకృష్ణ భగవానుడు సామ్రాజ్యాన్ని స్థాపించాడు హిందువులకు ముఖ్యమైన ద్వారకా దేవాలయం శ్రీకృష్ణ దేవా లయము శ్రీజగద్గురు శంకరాచార్యుల మఠం (ద్వారకాపీఠం) ఆదిశంకరాచార్యుల వారు స్థాపించారు.

"అనురాగములేని మనసున సుజ్ఞానమురాదు."

అహమ్మదాబాదుకు సుమారు 104 కి.మీ.ల దూరంలో మోదెరాలోగల సూర్య దేవాలయం వంటి దేవాలయం భారతదేశంలో చాలా అరుదైనది ఇది 1026 AD నాటిది. రాత్రి పగలు సమానంగా ఉండే మార్చి 21 మరియు సెప్టెంబరు 23వ తేదీలలో (విమ సంక్రాంతి సమయం) సూర్య కిరణాలు గర్భగుడిలో సూర్య బగవానుని విగ్రహంపై పడేటట్టు దీనిని నిర్మించారు



RASS DANCE

కాంబె జలసంధి దగ్గర అహమ్మదాబాద్‌కు చేరువగా ఉన్న లోథాల్ 2200-1700 BC లో మిక్కిలి ప్రసిద్ధి పొందిన రేవుపట్టణము. మౌర్యవంశపు చక్రవర్తి అశోకుని 14 శిలాశాసనాలు రాతి పలకమీద పాలీ బాషలో జునాగడ్ దగ్గర గిర్‌నార్ శిఖరం వద్ద లభించాయి గిర్‌నార్ పర్వత ప్రదేశం జైనుల యాత్రాస్థలంగా ప్రవృద్ధి పొందింది. ఇచ్చట అనేక జైన దేవాలయాలు ఉన్నాయి.

జునాఘడ్‌కి 60 కి.మీ.ల దూరంలో గిర్ అడవులలో మాత్రమే భారతదేశపు సింహం నివసిస్తుంది 1515 చ.కి.మీల విశాలమైన ఈ అడవులలో సుమారు 200 సింహాలు ఉన్నాయి. సపుతారా ఒక కొండ విడిది ఇది దక్షిణ గుజరాత్ సహ్యాద్రి పర్వత శ్రేణిలో ఉంది. 11వ శతాబ్దంలో ప్రారంభించి 20 వ శతాబ్దం వరకు గొప్ప గొప్ప భక్తులు 591 మీటర్ల శత్రుంజయ కొండపైన 863 జైన దేవాలయాలను నిర్మించారు

వ్యాపార కేంద్రంగా చారిత్రక ప్రసిద్ధి పొందిన పోర్‌బందర్ గాంధీ మహాత్ముని జన్మస్థలం ప్రభాస్-పటాన్‌లో సోమనాద దేవాలయం ఉంది. ఉద్వాడాలోని పార్శీల అగ్ని దేవాలయం (Fire Temple) మిక్కిలి ప్రాచీనమైనది

ప్రసిద్ధి పొందిన రచయితలకు, రాజకీయ నాయకులకు, దేశోద్ధారకులకు గుజరాత్ పుట్టినిల్లు నానాలాల్, ఉమాశంకర్ జోషి, కర్సన్ దాస్ మానెక్, వంటి గొప్ప గొప్ప పండితులు ఇక్కడే జన్మించారు భారతదేశపు నిర్మాతలలో ప్రముఖుడైన సర్దార్ వల్లభ్‌బాయిపటేల్ గుజరాత్‌కు చెందినవారు హరిజనులు మరియు ఆదివాసుల ఉద్ధరణకు పూనుకున్న తక్కర్ బాపాకి, కులపతి కె ఎమ్. మున్షివంటి పండితులకి ఇదే జన్మస్థానం ఇటీవల గొప్ప నవలా రచయిత పన్నాలాల్ పటేల్‌కి 1985 జ్ఞానపీఠ్ అవార్డు లభించింది. గుజరాత్‌లో రాస్ మరియు గార్బా ముఖ్యమైన జానపద నృత్యాలు ●

## ఐదేసి సంవత్సరాలకు 'లెమ్మింగు'లు పెరిగిపోతున్నాయి

లెమ్మింగ్ ఆసియా, యూరప్ మరియు ఉత్తర అమెరికా శీతల ప్రదేశాలలో నివసించే పసుపు పచ్చని ఇటుకరంగు జంతువు. ప్రతి 5 సంవత్సరాలకే స్కాండినేవియా (పశ్చిమోత్తర యూరప్)లో ఇవి బ్రహ్మాండంగా పెరిగిపోతాయి. మిలియనుల కొద్ది లెమ్మింగులు సముద్రంవైపు పోతూంటాయి. ఇలా వెళ్తున్నపుడు వీటిని ఇతర జంతువులు చాలావరకు తినేస్తాయి. మిగిలిన ఏ కొన్నో సముద్రంలో కొట్టుకుపోతాయి.

"స్వరరాగ సుధారసయుత భక్తి స్వర్గాపవర్గమురా ఓ మనసా!"

# నిజాలు - నిదర్శనాలు

## రత్నాలు మరియు ఆభరణాల ఎగుమతి

1988-89 సంవత్సరంలో రత్నాల మరియు ఆభరణాల ఎగుమతుల విలువ రూ. 4,565 కోట్లకు పెరిగింది. మొత్తం రత్నాల మరియు ఆభరణాల ఎగుమతిలో ప్రత్యేకం వజ్రాల



ఎగుమతి 93 శాతం. 1988-89 వ సం॥లో మొత్తం వజ్రాల ఎగుమతి విలువ రూ 4,230 కోట్లు. ప్రపంచంలో మొత్తం 90 మిలియను కారట్ల వజ్రాల ఉత్పాదనలో భారత దేశానిది 55 మిలియను కారట్లు. ప్రపంచ వ్యాప్తంగా పరిశీలిస్తే వజ్రాల వ్యాపారంలో భారతదేశవు వజ్రాల ఎగుమతి 35 శాతం.

— 'ఎకనామిక్ టైమ్స్' సౌజన్యంతో

* * *

## భారత దేశవు రైలు దారులలో మల్టీగేజి మార్గము 62,000 కి.మీ.లు

1950-51 నుండి 1987-88 సంవత్సరం మధ్యకాలంలో మల్టీగేజి రైలు మార్గం 53,600 కి.మీ. నుండి సుమారు 62,000 కి.మీ.కు పెరిగిపోయింది. 44 బిలియను టన్నుల ట్రాఫిక్ వాల్యూము (రెవిన్యూ మరియు నాన్ రెవిన్యూ) 231 బిలియను టన్నులు అయింది. 1 2 బిలియను ప్రయాణీకుల సంఖ్య 1987-88 సంవత్సరాంతానికి 3 8 బిలియను అయింది రూ. 827 కోట్ల మూలధనం (capital-at-charge) రూ 11,622 కోట్లకు పెరిగింది.

* * *

## భారతదేశంలో టీ ఉత్పాదన 700 మిలియను కిలోగ్రాములు

మొత్తం ఉత్పాదింపబడిన 700 మిలియను కి.గ్రాల టీలో 470 మిలియను కి.గ్రా.లు దేశంలో వినియోగమవుతూంది. 1988-89 లో టీ ఎగుమతులవల్ల లభించిన మొత్తం విదేశీ మారకం రూ 644 26 కోట్లు.

* * *

## లఘు పారిశ్రామిక సంస్థల ఎగుమతుల విలువ రూ. 3,648 కోట్లు

భారత దేశంలో 1985-86లో లఘు పారిశ్రామిక వస్తువుల ఎగుమతి విలువ రూ. 2769 కోట్లు. 1986-87లో ఇది రూ. 3,648 కోట్లకు పెరిగింది.

* * *

## పంజాబులో తలసరి ఆదాయం అత్యధికం

1987-88లో పంజాబు తలసరి ఆదాయం రూ. 5477 - అత్యధికం. రూ. 4490ల తలసరి

"ఎందరో మహానుభావులు అందరికీ వందనములు."

ఆదాయంతో మహారాష్ట్ర ద్వితీయ స్థానాన్ని, రూ. 3636 తో గుజరాత్ తృతీయ స్థానాన్ని ఆక్రమిస్తున్నాయి

* * *

## రికార్డు స్థాయిలో నూనె గింజల ఉత్పాదన

1988-89లో భారతదేశంలో నూనె గింజల ఉత్పత్తి 17 8 మిలియను టన్నులు రికార్డు




స్థాయిని అందుకుంది. 1984-85లో సాధించిన 12 9 మిలియను టన్నుల రికార్డు ఉత్పాదనకంటే ఇది 37 37 శాతం అధికం.

* * *

## భారత దేశంలో 42.4 కోట్ల నిరక్షరాస్యులు

భారతదేశం మొత్తం మీద నిరక్షరాస్యులు 424,256,000 మంది. వీరిలో 241,611,145 మంది చదువురాని స్త్రీలు ఉత్తర ప్రదేశ్‌లో నిరక్షరాస్యుల సంఖ్య అత్యధికం-80,756,753 దక్షిణ ప్రాంతంలో ఆంధ్రప్రదేశ్‌లో 37,514,855 మంది చదువు రానివారు

* * *

## 60,000 లీటర్ల మంచినీరు కాలుష్యం చెందుతూంది

ఒక్క సంవత్సరంలో శరీరసంబంధమైన 600 లీటర్ల వ్యర్థ పదార్థాలను టాయిలెట్లలోను, లెట్రీనులలోను త్రోసివేయడానికి 60,000 లీటర్ల మంచినీరు కాలుష్యం అయిపోతూంది.

* * *

## హెక్టేరుకి సగటు ఫలసాయం

వేరుశనగ పంట భారతదేశంలో సగటున హెక్టేరుకి 759 కి గ్రా.లు ఇదే ప్రపంచ సగటు ఉత్పాదన 1122 కి.గ్రా లు ఆవాల

## సుభాషితాలు

ఋతము సతృత మెరుంగ నెవ్వరి తరమగు
స్థితియు గతియు దెలియ దేటపడును
విన్న మాత్రమునన వివరింపగారాదు
విశ్వదాభిరామ వినురవేమ।

[విన్నంత మాత్రాన నిజమును కల్లను నిర్ణయించ కూడదు. ముందు వెనుకలు మంచి చెడ్డలు బాగా తెలుసుకున్న తరువాతే నిర్ణయించాలి.]

* * *

పలక మెడను చేతబట్టి ఖడ్గంబూన
బంటు తనమురాదు ప్రతిభ లేమి?
పిడిలోన దిరుగబెంచి పురుషుడౌనె
విశ్వదాభిరామ వినురవేమ।

[పిరికి చేతిలో డాలు పట్టుకున్నంత మాత్రాన, కత్తి పట్టుకున్నంత మాత్రాన వీరుడు కాలేడు, పురుషునివలె స్వేచ్ఛగా తిరిగినంత మాత్రాన స్త్రీ పురుషుడు కాలేదు]

"కొట్టిన వానిని కోపించక కీర్తించినవాడే మహాత్ముడగును."

విషయంలో హెక్టేరుకి ప్రపంచపు సగటు 1262 కి.గ్రా అయితే భారతదేశంలో 700 కి గ్రా.లు. సూర్య కాంతి ప్రపంచపు సగటు ఉత్పత్తి హెక్టేరుకి 1308 కి.గ్రా. లుంటే భారత దేశంలో హెక్టేరుకి 454 కి గ్రా లు మాత్రమే.

* * *

## ఈశాన్య ప్రదేశాలలో 100 శాతం గ్రామీణ విద్యుత్ సౌకర్యం పొందిన మొట్ట మొదటి రాష్ట్రము

ఈశాన్య ప్రదేశాలలో 100 శాతం గ్రామీణ విద్యుత్ సౌకర్యం ఉన్న మొట్టమొదటి రాష్ట్రం మరియు భారతదేశంలో5వ రాష్ట్రం నాగాలాండు

* * *

## భారతదేశంలో పాల ఉత్పత్తి

1987-88లో భారతదేశపు 45 87 మిలియను టన్నుల పాల ఉత్పత్తి 1988-89లో 48 70 మిలియను టన్నులు అయింది

* * *

## 16 లక్షల విదేశీ విలాస యాత్రికులు భారతదేశాన్ని సందర్శించారు

1988-89లో 16 లక్షలకు పైబడిన విలాస యాత్రికులు (టూరిస్టులు) భారతదేశాన్ని సందర్శించారు.

* * *

## ఆంధ్రప్రదేశ్‌లో అక్షరాస్యత

1981 దశ వార్షిక జనాభా లెక్కల ప్రకారం భారతదేశపు అక్షరాస్యుల సగటు శాతం 36 కంటే ఆంధ్రప్రదేశ్‌లో అక్షరాస్యుల శాతం 29 6 - చాలా తక్కువ. జనాభా సాలు పెరుగుదల రేటు 2 5 శాతం అయితే అక్షరాస్యతరేటు 0.5 శాతం - చాలా తక్కువ

* * *

## జనపనార ఉత్పాదన 13.88 లక్షల టన్నులు

భారతదేశంలో 1988-89లో మొత్తం జనప నార ఉత్పాదన 13 88 లక్షల టన్నులు అయితే 2 23 లక్షల టన్నుల ఎగుమతుల విలువ రూ. 243 37 కోట్లు.

* * *

## బ్రహ్మాండమైన క్రొత్త ఉష్ణ నక్షత్రాలు కనుగొనబడ్డాయి



*యుఎస్ఎ మిన్నెసోటా యూనివర్సిటీలో ఖగోళ శాస్త్రజ్ఞులు భూమికి సుమారు 15,000 కాంతి సంవత్సరాల దూరంలో పెద్ద మెగాలానిక్ మేఘంలోనూ, 2,30,000 కాంతి సంవత్సరాల దూరంలో చిన్న మెగాలానిక్ మేఘంలోనూ ఒక చిన్న గలాక్సీలో క్రొత్త ఉష్ణ నక్షత్రాలను కనుగొన్నారు వుట్టిన వెంటనే నశించి పోతూన్న బ్రహ్మాండమైన నీలి నక్షత్రాలను గురించి వివరాలు ఈ నక్షత్రాల వల్ల తెలుసుకోవచ్చునని వీరు అభిప్రాయ పడు తున్నారు*

"మహావేదికలపై కథాగానములొనెర్చడి కథకులకు శ్రోతలకుగల ఆనందము చేకూరదు."

## 21,784 వార్తాపత్రికలు మరియు ఇతర పత్రికలు

1984 లో భారతదేశంలో మొత్తం పత్రికల (వార్తా మరియు ఇతర) సర్క్యులేషన్ 6 11 కోట్లు. ఇది సంవత్సరానికి 10 4 శాతం పెరుగుదలను సూచిస్తూంది. డిసెంబరు 31, 1984 నాటికి మొత్తం వార్తాపత్రికలు, పీరియాడికల్స్ (వార, పక్ష, మాస వగైరా) సంఖ్య 21,784 ఇది 4 9 శాతం పెరుగుదలను సూచిస్తూంది.

* * *

## నాన్ రెసిడెంట్ ఇండియనుల డిపాజిట్లు రూ. 13,971 కోట్లు

భారతదేశంలో ఉన్న నాన్‌రెసిడెంట్ ఇండియనుల డిపాజిట్లు 1983లో రూ.1386 కోట్ల నుండి మార్చి 1989 కి రూ. 13,971 కోట్లకు పెరిగింది

* * *

## దేశంలో 1,59,283 ఖాయిలా సంస్థలు

భారతదేశంలో జూన్ 1987 నాటికి మొత్తం ఖాయిలాపడ్డ సంస్థలు 1,59,283. వీటి బాకీల మొత్తం సొమ్ము రూ.4222.69 కోట్లు.

* * *

## '88-'89 లో సిమెంటు ఉత్పాదన 44 మిలియను టన్నులు

43 5 మిలియను టన్నుల లక్ష్యాన్ని మించి 1988-89 లో 44 మిలియను టన్నుల సిమెంటు మనదేశంలో ఉత్పాదింపబడింది.

* * *

## భారతదేశంలో పొగాకు ఉత్పాదన

భారతదేశంలో ఉత్పాదింపబడే పొగాకులో క్రమబద్ధం చేయబడిన సిగరెట్లు తయారీ రంగంలో 24 శాతం ఉపయోగిస్తే, బీడీ తయారీదారులు 38 శాతం ఉపయోగిస్తున్నారు పొగాకు ఉత్పాదనలో ప్రపంచంలో భారతదేశం మూడవస్థానాన్ని ఆక్రమిస్తూంది ప్రతీ సంవత్సరం రూ 200 కోట్ల విలువ ముడి పొగాకు విదేశాలకు ఎగుమతి అవుతూంది

## ప్రపంచం పండించే పొగాకులో 25 శాతం చైనాలో వినియోగమవుతూంది



ఆరోగ్య సంరక్షణ కొరకు ఎన్నెన్ని హెచ్చరికలను ఇచ్చినా, ఎంత ప్రచారం చేసినా ప్రపంచం అంతటా 1000 మిలియనుపైగా జనం ప్రతి సంవత్సరం 5 ట్రిలియన్ సిగరెట్లను కాలుస్తున్నారు. యునైటెడ్ స్టేట్స్‌లో పొగాకు అమ్మకాలు 20 శాతం వృద్ధిపొందాయి. ప్రపంచం ఉత్పాదించే పొగాకులో 25 శాతం ఒక్క చైనాలో వినియోగం అవుతూంది

"ముందు చూపులేని నరుడెంతటి గొప్పవాడైనా సమాజదూషణకు గురికాక తప్పదు."

# నవభారత నిర్మాతలు

## జె.ఆర్.డి. టాటా

జహంగీర్ రతన్‌జీ దాదాబాయ్ టాటా పేరు భారతదేశంలో అందరికీ తెలిసినదే. ఇతడు ఫ్రాన్స్ రాజధాని పారిస్‌లో జూలై 29, 1904లో జన్మించాడు. ఇతడి తండ్రి ఆర్.డి. టాటా. ఇతడు జెమ్‌షేట్‌జీ నుస్సర్‌వాంజీ టాటా దాయాది మరియు దగ్గరి బంధువు అదీగాక భారత దేశంలో ప్రముఖ పారిశ్రామిక



వేత్తలలో ప్రథమశ్రేణికి చెందిన వారిలో ఒకడు. తల్లి ఫ్రెంచి యువతి

జహంగీరు విద్య ఫ్రాన్స్, జపాను మరియు భారతదేశంలో గడిచింది. 1922లో 18వ ఏట ఇతడు టాటా సన్స్ లిమిటెడ్‌లో ఒక అసిస్టెంట్‌గా పనిచేస్తూండేవాడు. నాలుగు సంవత్సరాల తరువాత ఆసంస్థకు అతడు డైరక్టరుగా నియమితుడయ్యాడు. 1938లో ఇతడు టాటాస్ బోర్డ్ ఆఫ్ డైరక్టర్స్‌కు ఛెయిర్మన్ గానూ, న్యూ ఇండియా అస్యూరెన్స్ కంపెనీ లిమిటెడ్‌కి వైస్ ఛెయిర్మన్‌గా పదవులను స్వీకరించాడు

1946లో టాటా ఎయిర్ ఇండియా లిమిటెడ్‌కి తరువాత 1948లో ఏర్పడిన ఎయిర్ ఇండియా ఇంటర్నేషనల్‌కి ఛెయిర్మన్ మరియు మానేజింగ్ డైరక్టరు పదవులను అధిష్టించాడు. తరువాత 1953 లో ఎయిర్ ఇండియాకి ఛెయిర్మన్, ఛీఫ్ ఎగ్జిక్యూటివ్ పదవులను పొంది, ఇండియన్ ఎయిర్‌లైన్స్‌కి సభ్యుడుగా ఎన్నుకోబడ్డాడు. నేషనల్ ఏరో నాటికల్ లాబొరేటరీ ఛెయిర్మన్ గాను, ఇంటర్నేషనల్ ఏర్‌ట్రాన్స్‌పోర్టు అసోసియేషన్ ఎగ్జిక్యూటివ్ కమిటీ సభ్యుడుగా ఉన్నాడు. 1948లో యునైటెడ్ నేషన్స్ జనరల్ అసెంబ్లీకి ప్రతినిధిగా పంపబడ్డాడు.

రెండవ ప్రపంచ సంగ్రామ సమయంలో బీహార్ జెమ్‌షెడ్‌పూర్‌లో టాటా స్టీల్ వర్క్స్‌ను యుద్ధావసరాలకు అనేక అభివృద్ధులతో విస్తృతపరచాడు టాటా రసాయనిక రంగంలో ప్రవేశించడానికి మిక్కిలి అభిలాషను పొందాడు. వైమానిక రంగంలో కూడా టాటా కార్యకలాపాలు వృద్ధిపొందాయి భారతదేశంలో పైలట్ లైసెన్స్‌ను పొందడానికి ఇతడే మొదటివాడు 1929 నుంచి ఇతడు నెంబర్ 1 ప్రైవేట్ లైసెన్స్‌ను పొంది ఉన్నాడు.

1930లో ఇతడు ఒంటరిగా భారతదేశము మరియు ఇంగ్లండుల మధ్య విమానాన్ని నడుపుకుంటూ ప్రయాణం సాగించాడు. ఇతడు భారతదేశంలో మొట్టమొదటి ఇండియన్ ఏర్‌లైన్, ఏవియేషన్ డిపార్ట్‌మెంట్ ఆఫ్ టాటాసన్స్ లిమిటెడ్ ద్వారా 1932లో టాటా ఏర్‌లైన్స్ ప్రారంభించి 1932 అక్టోబర్‌లో కరాచీ (ఇప్పుడు పాకిస్థాన్‌లో ఉంది) బొంబాయి సర్వీసు, 1937లో బొంబాయి ఢిల్లీ సర్వీసు ప్రారంభించాడు.

1962 అక్టోబర్ 15న ఎయిర్ ఇండియా

"జ్ఞానము ఏకత్వమునకు, అజ్ఞానము భిన్నత్వమునకు దారి చూపును."

30వ వార్షిక ఉత్సవ సందర్భంలో 'లియోపార్డ్ మోత్' విమానంలో కరాచి-బొంబాయి విమాన ప్రయాణాన్ని ఒంటరిగా సాగించాడు. అక్టోబరు 15, 1982లో ఎయిర్ ఇండియా మరియు ఇండియన్ సివిల్ ఏవియేషన్ గోల్డెన్ జూబిలీ సందర్భంగా తిరిగి కరాచి-బొంబాయి విమాన ప్రయాణాన్ని 78 ఏళ్ళ వయస్సులో ఒంటరిగా సాగించాడు

టాటా సంస్థ జహంగీర్ టాటా ఆధ్వర్యంలో బ్రహ్మాండమైన సాహసికోద్యమంగా రూపొందింది స్టీల్ వర్క్స్, కెమికల్ ప్లాంటులు గాక, నూలు మిల్లులు, కొబ్బరి నూనెమిల్లు, సిమెంట్ కంపెనీలు, గ్లిసరిన్ ప్లాంట్, అనేక సోప్ ఫాక్టరీలు స్థాపించాడు టాటా ఉద్యమాలన్నిటి లోను ప్రగతిని సాధించడమే జహంగీర్ టాటా ముఖ్యోద్యేయం.

1946 లో జెమ్‌షెడ్‌పూర్ స్టీల్ వర్క్స్‌లో ఒక క్రొత్త వేతన విధానాన్ని అమలుపరచాడు. ఇటువంటి ఇతరసంస్థలలో, అన్నిటికంటే ఇచ్చట అధిక వేతనాలు అమలుపరచబడ్డాయి. పనిలో నిపుణతకు బోనస్‌లు, మరియు ప్రతీ ఉద్యోగికి టాటా లాభాలలో కొంత శాతం బహు మానంగా ఇవ్వడం ప్రారంభించాడు రిటైరు అయిన వారికి అనేక లాభాలు కలుగ జేసాడు

బెంగళూరులో ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సైన్స్, బొంబాయిలో టాటా మెమోరి యల్ హాస్పిటలు, టాటా స్కూల్ ఆఫ్ సోషల్ వర్క్, టాటా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఫండమెంటల్ రీసెర్చి, భారతీయుల ఉన్నత విద్యలకు జె.ఎన్ టాటా ఎండోమెంట్, దారిద్ర్య కారణాల పరిశోధ నకు లండన్ స్కూల్ ఆఫ్ ఎకనామిక్స్‌లో ఒక చెయిర్ ఏర్పాటు చేయడానికి టాటా నిధులు సహాయపడుతున్నాయి.

జహంగీర్ టాటా పార్శీ మతస్థుడు. ఈ మతస్థులు 8వ శతాబ్దంలో పర్షియా నుంచి భారతదేశానికి వలసవచ్చారు ఈ పార్శీమతం అంత పెద్దది కాకపోయినా ఆర్థికంగా మిక్కిలి శక్తివంతమైనది మంచి పండితుడు, గ్రంధాభి లాషి, జీవితంలో ఉత్తమ కళోపాసకుడు అయిన టాటా ఇప్పుడు బొంబాయిలో సామాన్యంగా జీవిస్తున్నాడు. బోర్డ్ అండ్ అడ్వైజరీ కౌన్సిల్ మీటింగులలో అతి చాకచక్యంగా అనేక క్లిష్ట సమస్యలను సాధిస్తూ సభ్యులకు ఆశ్చర్యం కలిగించేవాడు

పండిత జవహర్‌లాల్ నెహ్రూతో భారతదేశ స్వాతంత్ర్యానికి సహకరించాడు. 1942లో గాంధీ మహాత్ముడు చెరలో పెట్టబడినప్పుడు

## తాజ్‌మహల్ క్రింద షాక్ అబ్జార్బర్‌లు



ఉత్తర ప్రదేశ్ ఆగ్రాలో తాజ్‌మహల్ పునాదులు భూమి అడుగున వేసిన వెల్ కాలమ్స్ (నూతి స్తంభాలు) ఆధారంగా ఉంటాయి. భవనం పునాదులు ఈనూతి స్తంభాల మధ్య చాపాకారంలో మన్నె ప్రత్యేకమైన దూలాలు ఉంటాయి. ఈ పెద్ద పెద్ద దూలాలను పునాదిరాళ్ళు రాగిరేకులు మరియు ఇటుకలతో బిగించబడ్డాయి. ఈ దూలాలు షాక్ అబ్జార్బర్లుగా ఉంటాయి. అందువల్లే భూకంపం వచ్చినప్పుడు భవనం ప్రక్కకు వంగవచ్చుగాని పడిపోదు

"తప్పులు చేయడం అందరికీ బాగా తెలుసు, తమ తప్పులు తెలుసుకుని సరిదిద్దుకోవడం చాలామందికి తెలియదు."

నిరసనగా తన ఉద్యోగస్థులు సమ్మె జరిపితే కంపెనీ రూ. 36,000,000 నష్టాన్ని కూడా లెక్క చేయకుండా వారితోపాటు సానుభూతిని ప్రకటించాడు.

భారతదేశపు పారిశ్రామిక జీవితంలో టాటా అపూర్వమైన గౌరవస్థానాన్ని పొందుతున్నాడు. భారతదేశంలో ఇతర కంపెనీలన్నిటికంటే వీరి కంపెనీలలో ఉద్యోగస్థులు అధిక వేతనాలు పొందుతారు మొట్టమొదట రోజుకు 8 గంటల పనిని ప్రవేశపెట్టిన పెద్ద కంపెనీ ఇదే ఉద్యోగస్థులకు కూడా లాభాలు శాతం పంచిపెడుతూన్న మొట్టమొదటి కంపెనీ ఇదే తన ఉద్యోగస్థులకు చౌకగా గృహవసతులను కల్పించాడు. వైద్య సౌకర్యం, క్లబ్బులు, సినీమాలు అనేకం వారికి ఏర్పరచాడు ఉద్యోగస్థులకు, వారి కుటుంబాలకు జెమ్‌షెడ్‌పూర్‌లో ఒక క్రొత్తనగరం ఏర్పడింది.

టాటా అనేక అవార్డులను, గౌరవప్రదమైన మర్యాదలను పొందాడు యునైటెడ్ స్టేట్స్ మిల్‌వాకీలో ది నేషనల్ అసోసియేషన్ ఆఫ్ ఫోర్మెన్ 1953లో ఇతడిని 'ఇంటర్నేషనల్ మానేజిమెంట్ మాన్'గా గౌరవించింది. 1954లో ఫ్రెంచి ప్రభుత్వం వారిచే ఆఫీసర్ ఆఫ్ లీజియన్ ఆఫ్ ఆనర్‌గా ఎన్నుకోబడ్డాడు. 1955లో భారతదేశపు అధ్యక్షుడు పద్మవిభూషణ్ బిరుదును ఇచ్చి గౌరవించారు హెచ్.హెచ్. పోప్ పాల్ VI 1964లో "నైట్ కమాండర్ ఆఫ్‌ది ఆర్డర్ ఆఫ్ సెంట్‌గ్రెగరీ ది గ్రేట్" అనే పావల్ ఆనర్‌తో గౌరవించారు. 1966లో ఇతడు ఇండియన్ ఎయిర్‌ఫోర్స్‌కి ఆనరరీ ఎయిర్ వైస్ మార్షల్ పదవిని పొందాడు. టాటా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఫండమెంటల్ రీసెర్చి, ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సైన్స్ ఆనరరీ ఫెలోషిప్పులతో గౌరవించారు. లండన్ ఐరన్ అండ్ స్టీల్ ఇన్‌స్టిట్యూట్ సభ్యుడుగా ఎన్నుకోబడ్డాడు. ఫెడరల్ రిపబ్లిక్ ఆఫ్ జర్మనీ "నైట్ కమాండర్స్ క్రాస్ ఆఫ్ ది ఆర్డర్ ఆఫ్ మెరిట్"తో గౌరవించారు. వీరికి పారిశ్రామిక శాంతికి సర్ జహంగీర్ గాంధీ మెడల్ బహూకరింపబడింది. 1983లో "కమాండర్ ఆఫ్ లీజియన్ ఆఫ్ ఆనర్" పదవికి ఎన్నుకోబడ్డాడు ఇటీవల ఇండియన్ సివిల్ ఏవియేషన్ పితామహుడు టాటా యు ఎస్ ఎ సీటెల్‌లో మిక్కిలి గౌరవప్రదమైన డేనియల్ గుగెన్‌హీమ్ మెడల్‌ను గ్రహించాడు.

ఆహ్లాదకరమైన సంభాషణా చతురుడు టాటా అనేక విద్యాసంస్థలతోను, సాంఘిక సంస్థలతోను, క్రీడా సంస్థలతోను సంబంధాలను ఏర్పరచుకున్నాడు. సాహిత్యోపాసకుడు, కళాపోషకుడు, విజ్ఞానాభిలాషి జహంగీర్ టాటా.

●




"పట్టుపట్టరాదు. పట్టి విడువరాదు. దీనినే దీక్ష అంటాం."

# మేల్‌కోట - సుప్రసిద్ధ దేవాలయం

ఎన్. రామకృష్ణ

కర్ణాటక రాష్ట్రం శ్రీరంగపట్నం తాలూకాలో మేల్‌కోట ఒక పవిత్రమైన యాత్రాస్థలంగా ప్రసిద్ధి పొందింది. ఇది మైసూరుకు సుమారు 50 కి.మీ ల దూరంలో ఉంది. దేవాలయం యదుగిరి కొండపై ఉంది ఎదురుగా కావేరీ నది ప్రవహిస్తూంటుంది.



Melkote

వైష్ణవ మతోద్ధారకులగు ప్రసిద్ధిపొందిన శ్రీరామానుజులు చోళ చక్రవర్తిచే దండింప బడ్డారు అప్పుడు రామానుజులు తప్పించుకుని చోళరాజ్యము నుంచి పారిపోయి మేల్‌కోటలో తలదాచుకుని, అక్కడ పది సంవత్సరాల పాటు ఉన్నారు.

అందువల్ల మేల్‌కోట ఒక గొప్ప యాత్రాస్థలంగా మారింది. ఇచ్చట శ్రీరామానుజులు జైనమతావలంబుడైన హొయిసల రాజు విష్ణువర్ధనునిచే వైష్ణవ మతాన్ని స్వీకరింప జేశారు దీనికి రాజుగారు మిక్కిలి సంతసించి దగ్గరగా కొన్ని భూములను వారికి దానం చేసాడు. 12వ శతాబ్దంలో జరిగిన కథ ఇది.

14వ శతాబ్దంలో మహమ్మదీయులు మేల్‌కోటను ముట్టడించి పట్టణాన్ని పూర్తిగా నాశనం చేసారు తరువాత విజయనగర చక్రవర్తుల మంత్రి దీనిని 1460 ADలో పునరుద్ధరింప జేసాడు 1771 లో మహారాష్ట్రులు మేల్‌కోటను దోచుకుని పట్టణాన్ని ధ్వంసం చేసారు కానీ ముఖ్యమైన దేవాలయం మాత్రం నేటికీ అనేక భక్తులను ఆకర్షిస్తూంది.

ఈ దేవాలయంలో శ్రీకృష్ణ విగ్రహం మిక్కిలి సుందరమైనది. దీనినే చల్లపిళ్ల రాయ దేవాలయం అని కూడా అంటారు. శ్రీ రామానుజులకు శ్రీకృష్ణుడు స్వప్నంలో ప్రత్యక్షమై తనను ఢిల్లీసుల్తానులు తీసుకొని పోయిరి అని చెప్పగా శ్రీరామానుజులు సుల్తానును సందర్శించుటకు వెళ్లిరి. అచ్చట సుల్తాను కుమార్తె అందమైన శ్రీకృష్ణ విగ్రహాన్ని అలంకరించి సింహాసనంపై ఉంచి ఆడుకొనుచుండెను రామానుజులు ఆ విగ్రహము తన కిమ్మని సుల్తానుని అర్థించెను సుల్తాను ఇష్టపడలేదు

## మనస్సును జయించినవారు ప్రపంచాన్ని జయిస్తారు

ఒక పెద్ద గాదెలో గడ్డి క్రింద ఒక పాము, చిన్న ఎలుక ఒకేచోట నివసిస్తూండేవి. ఒకరోజున రైతు గడ్డితీయబోతుంటే పాము కాటేసింది. అప్పుడే ఎలుక కూడా తల ముందుకు పెట్టింది. రైతు దీనిని చూచి, 'ఈ చిన్న ఎలుకేకదా' అని ఊరుకున్నాడు. రెండవరోజున రైతుని ఎలుక కరిచింది. పాము ముందుకు తలపెట్టి చూసింది. పాముని చూడటంతోటే రైతు భయంతో కేకలు పెట్టాడు 'బాబోయ్ పాము కరిచేసింది' అంటూ మూర్ఛపడిపోయాడు. భయంవల్ల భీతి కలుగుతుంది భయంవల్ల ధైర్యం నశిస్తుంది. కాబట్టి మనసును జయించినవాడు ప్రపంచాన్ని జయిస్తాడు.

— 'మా యోగశక్తి' సౌజన్యంతో

"అజ్ఞానాంధకారాన్ని పటాపంచలము చేయువాడే గురువు"

రామానుజులు ధ్యాన నిమగ్నుడై యోగ శక్తితో అందరూ చూచుచుండగా చల్లపిళ్ల రాయ కృష్ణా రమ్మని పిలువగా ఆ దివ్యసుందర మూర్తి నృత్యంచేస్తూ వచ్చి శ్రీరామానుజుల ఒడిలో చేరెను. సుల్తాను మరియు సభికులు ఆశ్చర్య చకితులైరి సుల్తాను మెచ్చుకుని భక్తి పూర్వకముగా ఆ విగ్రహమును రామానుజుల కిచ్చెను. శ్రీరామానుజులు ఆ విగ్రహమును మేల్‌కోటకు తీసుకువచ్చి అచ్చుట దేవాలయంలో ఉత్సవ విగ్రహంగా ప్రతిష్ఠాపించారు. సుల్తాను కుమార్తె ఆ దివ్య విగ్రహ వియోగాన్ని భరించ లేక అపరిమితమైన కృష్ణ భక్తితో మేల్‌కోట



SRI RAMANUJA

చేరి అచ్చుట స్వామిని నిత్యమూ సేవించుచూ చివరకు పరమాత్మునియందు లీనమయ్యెను. ఈమె జ్ఞాపకార్థం ఒక దేవాలయం కూడా ఇచ్చుట నిర్మింపబడింది.

మేల్‌కోటలో కొండపై శ్రీ నరసింహస్వామి దేవాలయం 1614లో మైసూరు రాజుల వశమైంది. శ్రీరంగపట్టణమును కలుపుకున్న కృష్ణరాజ వొడయర్ 1614లో తిరిగి ఈ దేవాలయాన్ని మేల్‌కోటలో బ్రాహ్మణులకిచ్చి తను కూడా వైష్ణవ మతాన్ని స్వీకరించాడు.

మేల్‌కోటలో 'వైరముడి' వజ్రాల కిరీటోత్సవం చాలా ప్రసిద్ధి పొందింది. మేల్‌కోట దేవాలయం చారిత్రకంగా హరిజనులకు ప్రవేశమును కలిగించిన మొట్టమొదటి దేవాలయము. శ్రీకృష్ణ విగ్రహమును ఢిల్లీ సుల్తానులనుండి



తీసుకువచ్చుటకు ఆనాడు హరిజనులు శ్రీ రామానుజులకు సహాయపడిరి. అందుచే శ్రీరామానుజులు ఆనాటి నుండి హరిజనులకు ఇచ్చుట దేవాలయ ప్రవేశ సౌకర్యం కలిగించి యున్నారు. శ్రీరామానుజులు మొట్టమొదటి సంఘసంస్కర్త.

## బేకరీలలో పనిచేసేవారు 2.5 మిలియను మంది

బేకరీ పరిశ్రమ 2.5 మిలియను మందికి ఇంకా వ్యవసాయంలో, ట్రాన్స్‌పోర్టులో పంపకము మరియు విక్రయరంగాలలో అనేక వేలమందికి ఉద్యోగావకాశాలు కలిగిస్తుంది. భారతదేశంలో ఆహార పరిశ్రమలలో బేకరీలు చాలా ముఖ్యపాత్ర వహిస్తున్నాయి.

— 'ఎకనామిక్ టైమ్స్' సౌజన్యంతో

"కర్తవ్యం విస్మరించి, జీవుని బాధించి,
దేవుని పూజించిన లాభముండదు."

# కలంస్నేహితులు

[మీపేరు, వయస్సు, చిరునామా, హాబీలు ఈ శీర్షిక క్రింద ప్రచురింపబడాలంటే తగిన వివరాలతో సహా రూ. 5/-లు మనియార్డరు ద్వారా పంపండి. —సంపాదకుడు]

1. మెలగందుల వెంకట్‌రుషి, 20 సం.లు., S/o సత్తయ్య, టంగుటూరు పోస్టు, ఆలేరు మండలం, (నల్గొండ జిల్లా) 508 101
పుస్తక పఠనం, దైవభక్తి, ప్రకృతి ఆరాధన.

2. మల్లిడి గంగిరెడ్డి, బి.ఏ మొదటి సంవత్సరం, కొంకుదురు, (తూ.గో.జిల్లా) 533 345
జనరల్ నాలెడ్జి సేకరణ.

3 వి. బాలకృష్ణ (బాలు), 20 సం లు, S/o లక్ష్మీనాయుడు గారు, గుడివాడ గ్రామము, పాడేరు పోస్టు మరియు మండలం, (విశాఖపట్టణం జిల్లా) 531 024
పుస్తకాలు చదవడం, ఫ్లూటు, ప్రకృతి ఆరాధన.

4. చెన్నంశేఖర్, 14 సం.లు, S/o సి.హెచ్. నారాయణ, దోమకొండ, (నిజామాబాద్ జిల్లా) 503 123.
క్రికెట్ ఆడడం, రేడియో వినడం, పత్రికలు చదవడం.

5 కోరాడ సూర్యారావు, 20 సం.లు, న్యూస్‌పేపర్ ఏజెంట్, బడ్డవానిపేట గ్రామము, ఉర్లంపోస్టు, నరసన్న పేట R.M. (శ్రీకాకుళం జిల్లా) 532 425
జనరల్ నాలెడ్జి, పుస్తకాలు, పేపరు చదవడం.

●

## ఎలుగుబంట్లు




యూరప్ మరియు ఆసియాదేశపు కొన్ని ప్రదేశాలలో నివసించే గోధుమరంగు ఎలుగుబంట్లను యూరప్, ఆసియాదేశాలలో సంతలలో, సర్కస్‌లలో ఆడిస్తారు. వీటికి సులభంగా ఆట, డాన్సు నేర్పవచ్చు.

ఉత్తర అమెరికా నల్లఎలుగు [illegible] సాధారణంగా పైకి కనిపించవు. వీటిని బెదిరించినప్పుడు కోపంతో ఉద్రేకించిపోయి అపాయకరంగా ప్రవర్తిస్తాయి.

యు.ఎస్.ఎ రాకీ పర్వత శ్రేణులలో నివసించే గోధుమరంగు బొచ్చు ఎలుగులు చాలా ఉగ్రమైనవి. [illegible] మానవులమీదపడి చంపేస్తాయి.

ఆర్కిటిక్ మహాసముద్రంలో మంచు పర్వతాలలో తిరిగే పోలార్ ఎలుగుబంట్లు ఆహారంకోసం నీటిలో చాలాదూరం ఈదుకుంటూ పోతాయి. వీటి బొచ్చు తెల్లగా ఉంటుంది.

అలాస్కా ద్వీపకల్పంలో ఉండే కొడియక్ ఎలుగుబంట్లు చాలాపెద్దవి. 2.7 మీటర్ల ఎత్తుగా 67[illegible] కి.గ్రా.లు ఉంటాయి. ఇది భూమి మీద నివసించే మిక్కిలి పెద్ద మాంసాహార జంతువు.

"శక్తిసామర్థ్యాలను వినియోగించు కోకుండా భారమంతా భగవంతుని మీదవేస్తే భగవంతుడుకూడా అనుగ్రహించడు."

# అవీ - ఇవీ

## ప్రపంచ రికార్డుల గిన్నెస్ పుస్తకం 60 మిలియను కాపీలు

1955 నుండి సుమారు 1,40,000 రికార్డులతో ప్రపంచ రికార్డుల గిన్నెస్ పుస్తకం 31



భాషలలో 60 మిలియను కాపీలు అమ్ముడైనాయి. క్రిస్టియనుల పవిత్ర గ్రంథం బైబిల్ తరువాత ఈ కాపీల అమ్మకం ద్వితీయస్థానాన్ని పొందుతుంది.

* * *

## భారతదేశంలో యురేనియం థోరియం వనరులు

బ్రీడర్ రియాక్టర్లలో ఉపయోగించే యురేనియం మరియు థోరియం నిధులు భారత దేశంలో 120 బిలియను టన్నుల మరియు 600 బిలియను టన్నుల బొగ్గుకు సరి సమానంగా ఉన్నాయి. ఇది భారతదేశంలో లభించే బొగ్గుకు సుమారు 6 రెట్లు.

* * *

## ఇంధనపు ఖర్చు మీద ఆదా

సోవియెట్ యూనియన్ జపారోజైలో కొమ్మునార్ అసెంబ్లీ సంస్థనుంచి ZAZ - 11023 జపారోజెట్స్ కారులు వస్తున్నాయి. లోపల ఎంతో సౌకర్యంగా ఉంటుంది. గంటకు 90 కి.మీ.ల వేగంతో 100 కి.మీ.లకు 48

**క్విజ్-జవాబులు:** 1. (డి) స్టాక్ మార్కెట్, 2. (బి) పెయింటింగ్, శిల్పము, కళలు మరియు ఆర్కిటెక్చర్ వగైరా, 3. (బి) థియరీ ఆఫ్ నంబర్స్, 4. (సి) ప్లాటినం జూబిలీ, 5. (సి) ఛోటా నాగ్‌పూర్ మైదానం, 6. (బి) వాటెజ్, 7. (ఎ) బీహార్, 8. (సి) ASEAN.

**తెలివికి పరీక్ష - జవాబులు:** 1. 4964. 2. నవల - ఇది చరిత్రాత్మకము మిగిలినవి వివిధ విషయముల క్రోడీకరణము. 3. (బి) 123. 4. (ఎ) తుని తీర్పు (బి) మక్కికి మక్కి. 5. కాళిదాస్ సమ్మాన్ మధ్యప్రదేశ్ ప్రభుత్వం. 6. చలించని మనస్సు భ్రమించని దృష్టి వలననే ఏకాగ్రత సాధ్యమవుతుంది. 7. మాయ—ఇది వేదాంతుల అనుభూతిని తెలియజేస్తుంది. 8. వారి స్థానాల వలననే వాటికి గుణాలు వచ్చాయి.

**మాటల మహిమ - జవాబులు:** 1. నిద్రపోవు తూలు (ఎ), వస్త్ర (బి). 2. కుత్తుక (ఎ), కంఠము (బి), కుత్తిక (సి). 3. రహస్యము (ఎ), ధైర్యము (బి), వంచన (సి). 4. చమత్కారము (ఎ), వేడుక (బి). 5. వంచన (ఎ), శృంగార చేష్ట (బి), పరిహాసము (సి), వ్యర్థము (డి). 6. దెస (ఎ), మార్గము (బి), వదిలి అనువంశ్యం (సి), రక్షకుడు (డి). 7. మార్గము (ఎ), దారి (బి), న్యాయము (సి), ఉపాయము (డి). 8. నిలుచుండు (ఎ), వర్తించు (బి), మెరుగు (సి), బ్రతుకు (డి).

"దరిద్రులకు ధనసహాయం చేయలేనివారి ధనము ఏకాంతంలో వ్యర్థమైపోయే యువతి యౌవ్వనం వంటిది."

లీటర్ల ఇంధనం - మామూలు కంటే 30 శాతం తక్కువ వినియోగమవుతుంది. ఎలక్ట్రిక్ ఇగ్నిషన్ మరియు వాటర్ కూలింగ్ వల్ల ఇంజను బాగా నమ్మకంగా పనిచేస్తుంది. ఎక్కువ దూర ప్రయాణాలలో ఇంధనాన్ని బాగా తగ్గిస్తుంది. అభివృద్ధి కావింపబడిన డైనమిక్స్‌వల్ల 18 సెకండ్ల కాలంలో గంటకు 100 కి.మీ. వేగం అందుకుంటుంది.

* * *

## యునైటెడ్ నేషన్స్ పోస్ట్ ఆఫీసు

యూనివర్సల్ పోస్టల్ యూనియన్ (UPU) యునైటెడ్ నేషన్స్ పోస్ట్ ఆఫీసు దీని స్టాంపులు దానికి ప్రత్యేకంగా ఉన్నాయి. అంతర్జాతీయ తపాలా విధానాన్ని అభివృద్ధి పరచి క్రమబద్ధం చేయుటయే దీని ముఖ్య ఉద్దేశ్యము. దీని హెడ్ క్వార్టర్స్ స్విట్జర్లాండ్ బెర్న్ (Berne) లో ఉంది.

* * *

## శరీరంలో ట్యూమర్లను తీయడానికి క్రొత్త విధానము

మెదడు క్రింద ఏర్పడ్డ ట్యూమర్లను తొలగించడానికి ప్రొ. ళుడ్‌విగ్ ఆయిర్ మరియు డా॥ నార్ ఎట్ లీట్‌గె అనే ఆస్ట్రియా వైజ్ఞానిక శాస్త్రజ్ఞులు అల్ట్రాసౌండ్ ఉపయోగిస్తున్నారు. కొన్ని సాంకేతిక అవరోధాలవల్ల ఇంతవరకూ అల్ట్రాసౌండ్ మెదడు పైతలం మీద ట్యూమర్లను తీయడానికే ఉపయోగించేవారు. మెదడులోగల ట్యూమర్లను తీయడానికి అల్ట్రాసౌండ్‌ను ఉపయోగించడం వల్ల మెదడులో ట్యూమర్ చుట్టుప్రక్కల ఉన్న నాడీ కణాలకు అపాయం ఉండదు.

* * *

## మిక్కిలి ప్రాచీనమైన ఆభరణ విశేషం

పచ్చరాళ్లు పొదగబడిన ఈజిప్టు కంకణము మిక్కిలి ప్రాచీనమైన ఆభరణ విశేషము. ఈ అమూల్యమైన రత్నాలు బహుశ సినాయి ద్వీపకల్పంలో మిక్కిలి ప్రాచీనమైన గనుల నుండి త్రవ్వబడ్డాయి. ఇది అప్పుడు టర్కీలో ఒక భాగమై ఉండేది. అందుకే దీనిని 'టర్క్వాయిస్' లేక 'టర్కీ స్టోన్' అని అంటారు.

* * *

## రక్తపుష్టికి పానీయం



బాగా పండిన మామిడి పండ్లరసం 200 గ్రాములు 50 గ్రాముల అప్పడాలు, ఒక చిన్న చెంచాడు అల్లపురసం – ఈమూడింటిని బాగుగా ఒక గ్లాసులో కలిపి అవసరమైతే కొద్దిగా పంచదార చేర్చి త్రాగండి. ఈవిధంగా మూడువారాలపాటు ప్రతిదినం తాగితే బుద్ధి పెరుగుతుంది. తలనొప్పి బాధ, శిరోభారం, మానసిక దౌర్బల్యంవల్ల ఏర్పడే తాత్కాలిక దృష్టిదోషాలు మొదలైనవి నయమవుతాయి. కాలేయం చైతన్యవంతమై రక్తపుష్టి కలిగి శరీరం దార్ఢ్యాన్ని పొందుతుంది.

— జి.ఎస్.వర్మ

"మానవులలో అహంకారమమకారాల వల్ల నీతివర్తన కరువైపోతుంది."

## చెవిలో అమర్చుకునే వినికిడి సాధనం

ఒక స్విస్ తయారీదారుడు చెవిలో పెట్టుకోడానికి వీలుగా రెక్స్టాన్ పెరల్ (Rexton Pearl) అనే మిక్కిలి చిన్న వినికిడి సాధనాన్ని తయారు చేస్తున్నాడు. 3 ట్రాన్సిస్టర్ ఆంప్లిఫైయర్, బాటరీ, మైక్రోఫోన్, రిసీవర్, వాల్యూమ్ రెగులేటర్ మొదలైన అన్ని సదుపాయాలతో ఉన్న దీనిని పూర్తిగా చెవిలో పెట్టుకోవచ్చు. ఇది నయాపైసా అంత చిన్నదిగా ఉంటుంది.

* * *

## మాస్కోలో పరిశుభ్రమైన గాలి!

యునైటెడ్ నేషన్స్ నిపుణుల పరిశీలన వల్ల ప్రపంచంలో అన్ని పెద్ద నగరాలలోకి సోవియెట్ యూనియన్ ముఖ్యపట్టణం మాస్కోలో గాలి పరిశుభ్రంగా ఉంటుందని తేలింది

* * *

## రాకెట్ బ్లాస్ట్-ఆఫ్‌లకు కౌంట్ డౌన్ ఫ్రిట్జ్ లాంగ్ కనిపెట్టాడు

సుప్రసిద్ధ సినీమా డైరక్టరు ఫ్రిట్జ్ లాంగ్ రాకెట్ బ్లాస్ట్-ఆఫ్‌లకు కౌంట్‌డౌన్‌లను కనిపెట్టాడు. 1929 లో తీసిన 'ది ఉమెన్ ఆన్ ది మూన్' అనే తన ఫిల్మ్‌కోసం దానిని ప్రవేశపెట్టాడు. దీనివల్ల సినీప్రేక్షకులలో మంచి బిగి ఏర్పడుతుందని ఇలా చేసాడు.

* * *

## ఆక్స్‌ఫర్డ్ ఇంగ్లీషు నిఘంటువు రెండవ కూర్పు

20 వాల్యూముల ఆక్స్‌ఫర్డ్ ఇంగ్లీషు నిఘంటువు రెండవ కూర్పు ఇప్పుడు రూ. 42,000 కు అమ్మబడుతూంది. దీని 22,000 పుటలలో అరమిలియనుపైగా మాటలు నిర్వచింపబడ్డాయి.

* * *

## 200 సంవత్సరాలలో 100 జాతుల క్షీరదాలు నశించాయి



17 వ శతాబ్దం చివర భాగంలో నావికులు మారిషస్‌లో నివసించే ఎగురలేని పెద్ద పక్షి 'డోడో' (dodo) జాతి పూర్తిగా అంతరించిపోయే వరకు వేటాడి చంపారు. 19 వ శతాబ్దం చివరి భాగంలో విచక్షణ లేకుండా వేటాడి అమెరికన్ బైసన్‌జాతిని అంతరింపజేశారు. గత 200 సంవత్సరాలలో 100కి పైగా అనేక క్షీరదాలు అదృశ్యమైపోయాయి. ఒకప్పుడు భారతదేశంలో సర్వసాధారణంగా కనిపించే అడవి గాడిదలు ఇప్పుడు 1000 కంటే ఎక్కువగాలేవు. గంభీరమైన ఆసియా సింహం గుజరాత్‌లో ఒక చిన్న ప్రదేశంలో మాత్రమే ఉంది. ప్రపంచం అంతటా జంతువులకు పార్కులు, రిజర్వులు ఉన్నాయి. వీటికి ప్రకృతి సిద్ధంగా అనువైన ప్రదేశాలను మానవుడు ఆక్రమిస్తూంటే ఈ జంతువుల సంరక్షణకు ఇవే శరణ్యం.

—సి ఇ ఇ ఎస్ ఎఫ్ ఎస్ సౌజన్యంతో

"చలించని మనస్సు, భ్రమించనిదృష్టి వల్లే ఏకాగ్రత సాధ్యమవుతుంది."

## ప్రపంచంలో ఎక్కువ రద్దీగా ఉండే అంతరిక్షపు రేవు

సోవియెట్ యూనియన్ ముఖ్యపట్టణం మాస్కోలో ప్లెసెట్స్క్ కాస్మోడ్రోమ్ ఈనాడు మిక్కిలి రద్దీగా కనిపించే అంతరిక్షపు రేవు (space port). ఇక్కడ నుంచి వెయ్యికి పైగా అంతరిక్షపు లాంచీలను పంపారు.

* * *

## 9 సంవత్సరాల వయస్సులో రచించిన నవల అత్యధికంగా అమ్ముడయింది

1909లో డెయ్‌సీ ఆష్‌ఫర్డ్ 9 సంవత్సరాల వయస్సులో రచించిన నవల అత్యధికంగా అమ్ముడయింది. 'ది యంగ్ విజిటర్స్' అనే ఈ హాస్య నవల 2,00,000 పైగా అమ్మబడ్డాయి. ఇంత బ్రహ్మాండమైన విజయం పొందిన ఆమె తిరిగి ఒక్కనవల కూడా వ్రాయడానికి పూనుకోలేదు.

* * *

## పక్షుల గాన కచ్చేరీలకు పరవశించిపోతారు

రష్యాదేశపు లియోనార్డ్ కోయిర్ మెటాస్కీ పరిశోధనా ఫలితంగా పక్షులు ఇంపుగా సుశ్రావ్యంగా పాడగలవని రుజువు చేసాడు. ఇతడు పక్షుల గాన కచేరీలు ఏర్పాటు చేస్తూండేవాడు. టివి ప్రోగ్రాంలలో కూడా ఇతడి పక్షుల ప్రదర్శనలు చూపించబడ్డాయి.

* * *

## టైఫాయిడ్‌కి క్రొత్త టీకామందు

యుఎస్‌ఏలో నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ చైల్డ్ హెల్త్ అండ్ హ్యూమన్ డెవలప్‌మెంట్‌లో వైద్యులు బ్రహ్మాండంగా పనిచేసే క్రొత్త టైఫాయిడ్ టీకామందును కనుగొన్నారు. సాల్మొనెల్లా టైపీ అని చెప్పబడే టైఫాయిడ్ సూక్ష్మజీవుల పైకోశం VI అనేది శరీరంలో టైఫాయిడ్ సూక్ష్మజీవులను నశింపజేయడానికి ఆంటీబాడీలను సృష్టిస్తుంది.

## విక్టోరియా మెమోరియల్



VICTORIA MEMORIAL

కలకత్తాలో విక్టోరియా మెమోరియల్ హాల్ మొత్తం 80,300 టన్నుల బరువు తూగుతుంది. పైభాగంలో ఒక గోళం మీద విజయవిగ్రహం తిరుగుతూంటుంది. బ్రిటిష్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఆర్కిటెక్ట్స్ ప్రెసిడెంటు సర్ విలియమ్ ఎమర్సన్ దీనికి రూపకల్పన చేసి కోటిరూపాయలకు పైన ఖర్చుతో దీనిని నిర్మించారు. దీని నిర్మాణం 1904లో ప్రారంభించబడి 1935 వరకూ జరిగింది.

1921 లో భారతదేశపు బ్రిటిష్ మహారాణి విక్టోరియా జ్ఞాపకార్థం ఇది నిర్మించబడింది. ఈ బ్రహ్మాండమైన భవనంలోని 25 గ్యాలరీలలో చిత్రాలు, శిల్పాలు, లిఖితగ్రంథాలు, వివిధ ఆయుధాలు, మెడల్సు, నాణాలు మొదలైన 3,500 వస్తువులు ప్రదర్శింపబడతాయి. భగవద్గీతకు పర్షియన్ అనువాదం [illegible] ప్రాతప్రతి కూడా ఇక్కడ ప్రదర్శింపబడుతూంది.

"విషయాన్ని హృదయస్థం చేసుకోవాలి, కంఠస్థం చేసుకుంటే చాలదు."

# ఆనందం అభివృద్ధి చేసుకో

మన కళ్ళకు, చెవులకు, స్పర్శకు, మనస్సుకు, హృదయానికి విందు ఆనందం ఇటువంటి ఆనందం మనమీదే ఆధారపడి ఉంటుంది ప్రపంచంలో లభించే సుఖసంతోషాలన్నీ లభించినా దురదృష్టం వదలకపోవచ్చు అలాగే అష్టకష్టాలతో తికమకలు పడిపోతూన్నా ఎంతో ఆనందంగా ఉండవచ్చు.



సంతోషంగా ఉండాలంటె ధైర్య సాహసాలు ముఖ్యం. మనకి ఏ అపకారం జరిగినా మాట వరసకి నిందల పాలైనప్పుడు ఉత్సాహంతో వాస్తవాన్ని ఎదుర్కోగల శక్తి ఉంటేనే తప్ప ఆనందం అనుభవించలేము. ఇంకొకరు నిరామయమైన నిత్యానందంతో ఉంటే వారిని చూచి అసూయ పొందకూడదు, ఈర్ష్య చెందకూడదు.

మనకి తృప్తి అనేదే ఉండదు. అందుకే మనలో కొందరు అసలు ఆనందం అనుభవించలేరు. ఎంతో ఆశిస్తాం. ఆశకు అంతు ఎక్కడ? ఆశించినది అందనప్పుడు, కోరినది దొరకనప్పుడు అసంతుష్టితో దుఃఖిస్తాం. కోపంతో చిరచిరలాడుతూ అసూయ పొందుతాము. ఎన్ని కష్టాలు సంభవించినా, నిజం చెప్పాలంటే చలించకుండా నిమ్మకు నీరెత్తినట్లుండాలి. అన్నిటినీ తేలికగా తీసుకోడం అలవాటు చేసుకోవాలి. స్థిమితంగా నిత్య సంతృప్తితో ఉండటం అభ్యాసం చేసుకోవాలి. జీవితాంతం సుఖం ఉండదు. సుఖం క్షణ కాలం ఉండేది అటువంటి సదవకాశాలను మనస్సులో జ్ఞాపకం పెట్టుకుని జీవితం గడపాలి.

ఆనందంగా ఉండాలంటే దాతృత్వం ఉండాలి. ఇంకొకరికి ఇవ్వాలి. ప్రేమానురాగాలతో ఔదార్యంగా ఉండగలిగితే జీవితంలో ఎంతో మంచిని అనుభవిస్తాము అనురాగం, అభిలాష, ఉత్సాహం ప్రవృద్ధి చేసుకోవాలి ప్రతిఫలం దక్కకపోయినా, అభినందించక పోయినా విచారపడనవసరం లేదు. ఇచ్చిన దానికి ప్రతిఫలం ఆశించకూడదు. ప్రతిఫలం ఆశిస్తే ద్వేషం అంకురిస్తుంది సంతృప్తి ఉండదు. కృతజ్ఞతను ఆశించకుండా మంచిని చెయ్యాలి. ఒకరికి ఉపకారం చెయ్యడంలో ఉండే సంతోషం అనంతం.

ఏంచేస్తే తృప్తి, ఆనందం కలుగుతుందో, నీకేది ఇష్టమో తెలుసుకో. సాధించ దలచినది ధైర్యంగా సాధించాలి ఆ సమయానికిది నాగరికత అనిపించక పోయినా ధైర్యంగా ఎవరి ధర్మంవారు ఆచరించి తీరాలి. ఎవరి వ్యక్తిత్వం వారు నిలబెట్టుకోవాలి ఎవరికి వారు తమలా ఉండటం అలవాటు చేసుకోవాలి. సౌశీల్యాన్ని అభివృద్ధి చేసుకుంటూ జీవించి, ఇంకొకరిని జీవించనివ్వాలి. సహకారభావం ఉండాలి. పరస్పరానురాగంతో ఒకరు చేసిన అపకారం మరచిపోయి ఉపకారం చేయడానికి ఉద్యమించాలి అప్పుడు జీవితం ఎంత కంటకమయమైనా పూలబాటలా ఉంటుంది. నిత్య జీవనంలో రసస్ఫూర్తి కలగాలి. మనస్సులో చిత్తవృత్తులు ముడిగుండాలు తిరుగకుండా మనస్సుని నిర్మలంగా ఉంచుకుంటే నిత్యానందంతో ప్రకాశిస్తారు. ●

"కాల, కర్మ, కర్తవ్యాలే మానవుని ప్రధానధర్మం."

# మన ఆదివాసులు

## చెంచులు

ఆంధ్రప్రదేశ్ కర్నూలు జిల్లా నల్లమలై కొండలలో మార్కాపూరు తాలూకా మంత్రాల అడవులలో ఎర్రగొండపాలెం, గంజివారి పల్లె ప్రదేశాలలో చెంచులు నివసిస్తూంటారు

చెంచులు ఒక విధమైన యాసతో తెలుగు భాష మాట్లాడుకుంటారు. మొగలాయి చక్రవర్తి




ఔరంగజేబు కుమారుడైన మహమ్మద్ మాసుమ్ 1694లో కర్నూలు వైపు ప్రయాణం చేస్తూండగా అతడికి చెంచులు ఎదురైయారు. వీరు నల్లగా ఉంటారు. తలమీద నిడుపాటి వెంట్రుకలు ఉంటాయి. ఆకులతో చేసుకున్న టోపీలను తలమీద ధరిస్తారు. ఏదైనా అపాయం జరుగుతుందని తెలిసినప్పుడు వీరు మానవులకు అసాధ్యమైన వేగంతో కొండలలోకి పారిపోతారు.

ప్రాచీన కాలంలో చెంచులు భయోత్పాతంగా దారిదోపిడీలు, దొంగతనాలు చేస్తూండేవారు. బ్రిటిష ప్రభుత్వంవారు వీరిని అణిచిపెట్టారు. చెంచులు గుర్రం, మేక, అరటి చెట్టు, తేట, బంగారు కాసు, గొయ్యి మొదలైన పేర్లతో విడివిడిగా ప్రత్యేక కుటుంబాలుగా పిలుస్తారు. వీరిలో ప్రతీ గూడేనికి ఒక పెద్ద ఉంటాడు. ఒక్కొక్క గూడెంలో 20 మొదలు 50 పాకలు ఉంటాయి. ఈ పెద్దపైన సుమారు 10 గూడేలను చూసుకునే నాయకుడు ఉంటాడు. ఈ నాయకుడిని రెడ్డి అంటారు వీరిలో సివిలు, క్రిమినలు కేసులకి ఈరెడ్డి న్యాయవిచారణ చేస్తాడు. అతడి తీర్పే తుదితీర్పు. విధించిన పన్ను వెంటనే చెల్లించవలసి ఉంటుంది.

చెంచులలో పెళ్లి తంతు చాలా వింతగా ఉంటుంది. ఒక విల్లు బాణము చేర్చి కట్టి భూమిమీద పాతిపెట్టి వధూవరులను ఇద్ద

### నెం. 13 ప్రభావం

*నెంబరు 13 కు శకునం పలికే అపూర్వ శక్తి ఉందని విశ్వసించబడుతూంది. సోవియెట్ ప్రధాన మంత్రి కృశ్చేవ్ అక్టోబరు 13, 1964 న లియోనిడ్ బ్రెజ్‌నేవ్‌చే వెళ్లగొట్టబడ్డాడు.*

*నెంబరు 13 ప్రభావం వల్ల అమెరికా అంతరిక్షయాన సాధనం అపోలో 13, 1970 లో ముక్కలు ముక్కలు అయిపోయింది. దీనిని అంతరిక్షంలోకి బ్లాస్ట్ ఆఫ్ చేసి పంపిన సమయం 13.13 గంటలు. తరువాత ఏప్రిల్ 13న దాని విద్యుచ్ఛక్తి నిలిచిపోయింది.*

*1971 ఇంటర్నేషనల్ ఎవరెస్ట్ ఎక్స్‌పెడిషన్‌లో 13 దేశాలకు చెందిన పర్వతారోహకులు ఉన్నారు. ఇక శిఖరం 548 మీటర్ల ఎత్తున ఉంది అనగానే వీరంతా కార్యక్రమం విరమించుకోవలసివచ్చింది.*

*ప్రపంచ ప్రసిద్ధి పొందిన శిల్ప శాస్త్ర నిపుణుడు లెకోర్బూసియర్ పంజాబులో చండీఘర్ నిర్మాణంలో 13 సెక్టారును పూర్తిచేయకుండా విరమించాడు. నెం. 13 అంటే అతడికి భయం.*

*యునైటెడ్ స్టేట్స్‌లో ఎన్నో ఎయిర్‌లైనులలో 13వ నెంబరు విమానం ఉండదు. విమానంలో 13 వ నెంబరు సీటు అసలు ఉండదు.*

"భావశుద్ధియే జ్ఞాన సిద్ధి."

రినీ దానిచుట్టూ ప్రదక్షిణం చేయిస్తారు. పెద్ద వాళ్లు ఆశీర్వదించి వారిమీద అక్షింతలు జల్లుతారు. ఒక్కొక్కప్పుడు వధూవరులు ఇద్దరూ అడవికి వెళ్లి ఒకరాత్రి అచ్చట గడిపి మరు నాడు ఉదయం ఇంటికి తిరిగి వస్తారు వారి తలిదండ్రులు బంధువులను, ఇరుగు పొరుగు వారిని ఆహ్వానిస్తారు. వధూవరులకు కొత్త బట్టలు పెట్టి వారిద్దరికి వివాహం జరిగినట్లు ప్రకటిస్తారు. సాధారణంగా పెళ్లి మధ్యాహ్నం అభిజిన్ ముహూర్తంలో సరిగ్గా 12 గంటలకు జరిపిస్తారు.

చెంచులు అడవులలో లభించే తేనె, కొమ్ములు, చర్మాలు వగైరా సేకరిస్తారు. వీళ్లు తేనెపట్టు లేక గూడు ఆకారంలో కట్టుకున్న పాకలో నివసిస్తారు. వీళ్ల గుడిసెలు సాధారణంగా చెరువు లేక కాలవ దగ్గర ఉంటాయి. వీళ్లు పప్పుదినుసులు, కంద దుంపలు, అడవిలో లభించే వేళ్లు, పళ్లు, ఇప్పపువ్వులు, మొగ్గలు, చింతకాయలు తింటారు. పురుషులు మొలకు గుడ్డ చుట్టుకుంటారు. స్త్రీలు చీర కట్టుకుంటారు.

పూర్వం చెంచులు విజయనగర సామ్రా జ్యంలో మరియు హైదర్‌అలీ దగ్గర సైన్యంలో ఉండేవారు. వీరు కొండ ప్రదేశాలలో, మైదా నాలలో బహుదూరం ప్రయాణం చేసేవారు. బ్రిటిష్ ప్రభుత్వంవారు ఈ అడవులను ఆక్ర మించినప్పుడు చెంచులు పోరాడి దోచుకుని ఎదిరించారు. బ్రిటిషువారు వీరిని పూర్తిగా అణగద్రొక్కారు. మార్చి 1929లో చివరి చెంచు తిరుగుబాటుదారులలో నాయకుడైన మండ్ల బైగా అనే వానిని తుమ్మలబైలు దగ్గర చంపేసారు. ఈనాడు చెంచులకు పునరావాసం సంకల్పించారు. వీరు ఇప్పుడు చుట్టువట్ల దోపిడీకు పాల్పడ కుండా నిశ్చింతగా జీవిస్తున్నారు. ●

## ఎత్తైన ఆల్ప్స్ శిఖరాలు

యూరప్‌లో మిక్కిలి ఎత్తైన మరియు పొడవైన పర్వత శ్రేణిలో స్విట్జర్లాండ్ దగ్గర ఆల్ప్స్ శిఖరాలు ఇంకా ఎత్తుగా పెరిగిపోతున్నాయి ప్రతీ సంవత్సరం ఇవి 6 మి.మీ.లు పెరుగుతున్నాయి

— 'స్విస్ టొపోగ్రాఫికల్ డిపార్ట్‌మెంట్' వారి సర్వే రిపోర్టు సౌజన్యంతో

## ప్రేమమయి-జగజ్జనని



ప్రాణభిక్షను పెట్టే సూర్యుడు, శ్రేయోదాయకమైన వాన, పుష్కలమైన పంటలనిచ్చే భూమాత ఉత్తేజాన్ని కలిగించే గాలి అన్నీ సౌభాగ్యవంతమైన ప్రకృతిమాత మనకిచ్చిన అపూర్వ సంపద, వర ప్రసాదం. అనుభవించగలిగినది ఎంతైనా ఉంది. చూడటానికి సరైన దృష్టి వినటానికి సరైన చెవులు ఉంటే చెట్లు పలకరిస్తాయి, కొండలు మాట్లాడతాయి. ప్రవహించే సెలయేళ్ళు ధర్మప్రవచనాలను ఇస్తాయి.

రకరకాల పండ్లు కూరగాయలు మన శరీరానికి పుష్టినిస్తాయి. సువాసనలతో కూడిన రంగు రంగుల పూలచెట్లు జీవితాన్ని సుఖమయం చేస్తాయి. కృతజ్ఞత లేని మానవుడు కృతఘ్నుడై ప్రకృతిని దోచుకుంటున్నాడు. ప్రకృతి ధర్మాలను ఉల్లంఘించి సదవకాశాలను దుర్వినియోగం చేసుకుంటున్నాడు.

"జ్ఞానేంద్రియాలైదు, కర్మేంద్రియాలైదింటిని
ఆత్మలో సమ్మేళనం చేయడమే ఆత్మయోగం"

# 'బో' మరియు 'పైథాన్'

టి.ఎస్.ఎన్. మూర్తి

ఒకరకం పెద్దపాము 'బో' సాధారణంగా వేటాడే ఆహారవు జంతువు చుట్టూ చుట్టుకు పోయి గట్టిగా అణిచి చంపుతుంది. 'పైథాను' (అజగరము) నలగగొట్టి చంపుతుంది.

బో పాములు, పైథానులు ఎక్కువగా నీటి సమీపంలో నివసిస్తాయి. ఎక్కువసేపు నీటిలోనే ఉంటాయి. ఈ జాతికి చెందిన



Red Sand Boa

పాముల తోకకు ఒక ఆధారాన్ని గట్టిగా పట్టుకో గల (Prehensile) శక్తి ఉంటుంది. ఈ శక్తివల్లే చాలా పెద్దశరీరంతో ఉండే ఈపాములు చెట్ల మీదికి సులభంగా ప్రాకగలుగుతాయి. ఇవి రాత్రివూట సంచరిస్తాయి. దీనికి అనుగుణ్యంగా వీటి కళ్లు చాలా చిన్నవిగా ఉంటాయి. కంట్లో పాపలు నిలువుగా ఉంటాయి. ఈ రెండు జాతులకు కూడా ముఖ్యంగా చిన్నచిన్న పక్షులు, ఇతర క్షీరదాలు ఆహారం.

బోయ్‌డే (boidae) కుటుంబానికి చెందిన పాములు విషపాములు కావు. ఇవి ఎరను గట్టిగా చుట్టుకుపోయి అణిచి చంపేస్తాయి. సంతానోత్పత్తి విధానాన్ని అనుసరించి బోయ్‌డే జాతి పాములు రెండు జాతులుగా వర్గీకరింపబడ్డాయి. బో జాతికి చెందినవి చిన్న పిల్లలను పెడతాయి. పైథానులు గ్రుడ్లను పెడతాయి. భారతదేశంలో ఉండే 'బో' లు కొద్దిగా అమెరికా 'బో' లను పోలి ఉంటాయి. నికోబార్ ద్వీపాలలో నివసించే మన భారత దేశపు రెటిక్యులేటెడ్ (వలవంటి చర్మంగల) పైథాన్ ప్రపంచంలో మిక్కిలి పెద్దది.

మరోరకం పైథాన్ ఏషియాటిక్ రాక్ పైథాన్‌లు మనదేశం అంతటా ఉంటాయి. ముఖ్యంగా ఇవి దట్టమైన అడవులలో నివసించినా నదీముఖద్వారాల దగ్గర, మాన్‌గ్రోవులు, బురద ప్రదేశాలలోను, చిన్న చిన్న కొండ వాగులు ప్రవహించే చిట్టడవులలోను కూడా ఉంటుంటాయి. ఇది సాధారణంగా ఆరు మీటర్ల పొడవుగా పెరుగుతుంది. శరీరంమీద పెద్దపెద్ద మచ్చలు ఉంటాయి. తోక పొట్టిగా ఉంటుంది తలమీద బాణపు గుర్తు ఉంటుంది. వీటిని బట్టి దీనిని సులభంగా తెలుసుకోవచ్చు.

## 2020 సంవత్సరం నాటికి 758 మిలియను టన్నుల బియ్యం కావలసి ఉంటుంది

2020 సంవత్సరం నాటికి ప్రపంచంలోగల ఎనిమిది బిలియను (8000 మిలియను) మంది జనాభాకే సంవత్సరానికి 758 మిలియను టన్నుల బియ్యం అవసరమవుతుందని మనీలా ఫిలిప్పైన్స్‌లో అంతర్జాతీయ బియ్యపు పరిశోధనా సంస్థవారు అంచనా వేశారు. ఇది ఈనాడు పండింపబడుతూన్న దానికి 60 శాతం అధికం.

"కప్పు సరిగా లేని ఇంటిలోనికి వానలు, వడగళ్లు కురియును. క్రమశిక్షణ లేని మనస్సులో కోర్కెలు విజృంభించి కడగండ్లపాలు చేయును." —గౌతమబుద్ధుడు

ప్రపంచంలోగల పైథానులలో రెటిక్యు లేటెడ్ పైథాన్‌లు ముఖ్యమైనవి. దీని శరీరంపైన విషమకోణ సమచతుర్భుజాకారంలో మచ్చలు ఉంటాయి. ఇది వలలాగ ఉంటుంది. దీనికి పోటీ దక్షిణ అమెరికాలో అనకొండా అనే నీటిలో నివసించే 'బో' పాము. ఇది 11 5 మీటర్ల పొడవుగా పెరుగుతుంది. అనకొండా శరీరం చాలా పెద్దది కాబట్టి దానికి పక్షులు, కోళ్లు, బాతులు, పిల్లులు, కుక్కలు, పందులు, జింకలు, తాబేళ్లువంటి ఆహారం అధికంగా కావలసి ఉంటుంది. ఇది ఎరని బాగా అణిచిపెట్టి ఊపిరి తిరుగకుండా చేసి చంపేస్తుంది. జంతువు చచ్చిపోయేదాకా గట్టిగా చుట్టుకుంటుంది.


COMMON SAND BOA

భారతదేశంలో 'రెడ్ సాండ్ బో' 'మామూలు సాండ్‌బో' అని 'బో' పాములు రెండు రకాలున్నాయి. సాండ్‌బోలు రాత్రిపూట సంచరిస్తాయి. ఎలుకలు, పందికొక్కులను వేటాడుతుంటాయి ఇవి చాలా మందకొడిగా ఉంటాయి. చురుకుదనం ఉండదు. వదులుగా ఉండే ఇసుకలో దూరి ఉంటాయి. వీటిని భయపెట్టినప్పుడు గుండ్రంగా చుట్టుకుపోయిన చుట్టలలో తలదూర్చేసుకుంటాయి. ఇవి ఒక్కొక్కసారి 6 మొదలు 8 పిల్లలను పెడతాయి. పాము పిల్లలు తలిదండ్రులను పోలి ఉంటాయి.

'రెడ్ సాండ్‌బో' తోక చాలా మొద్దుబారి రెండో తలలాగా కనిపిస్తుంది పాములను ఆడించే వాళ్లు సాధారణంగా వీటిని పట్టుకుని వీటికి రెండు తలలు ఉన్నాయని చెబుతుంటారు. మామూలు 'సాండ్‌బో' లు మైదానాలలోను కొండ ప్రదేశాలలోను ఉంటాయి.

భారతదేశపు పాములలో రాకాసిలా ఉండే పైథానులు ముఖ్యంగా అడవులలోనే ఉంటాయి. ఇవి బాగా బద్ధకమైన పాములు. ఉన్నచోటు


INDIAN PYTHON

నుండి కదలవు ఆకలి అయినప్పుడుగానీ, లేపినప్పుడుగానీ మెల్లిగా లేచి ప్రాకుతాయి. ఎలుకలు, చిన్నచిన్న పక్షులు, నక్కలు, జింకలు, ఎద్దులు, అడవిపందులు మొదలైన వాటిని తింటాయి. పైథానులు ఆహారపు ఎరను బాగ చుట్టుకుని గట్టిగా నొక్కి చంపేస్తాయి. ఎముకలను విరుగగొట్టదు. పైథానులు చాలా పిరికివి. బాగా రెచ్చగొట్టి బెదరగొడితేగాని ఉద్రేకం చెందవు. పైథాను పాముల చర్మాలు చాలా విలువైనవి. దీనికోసమే ఈ పెద్దపెద్ద పాములను విస్తారంగా చంపేస్తారు




"ఎంతటి తీయని పూలవాసనలైననూ గాలికెదురీద జాలవు.
సత్కర్మల సౌరభాలు ఎదురుగాలిలో కూడా ప్రసరించగలవు.
సత్పురుషుని ప్రభావ పరిమళము దశదిశలూ వ్యాపించగలదు."

# స్విస్ బాంకులు

ఆల్ప్సు కొండల మధ్య 16 వేల చదరపు కిలోమీటర్ల వైశాల్యంతో ఆరున్నర కోట్ల జనాభా రాజకీయంగా ఏకూటానికి చెందకుండా తటస్థంగా ఉండే చిన్నదేశం స్విట్జర్లాండ్.

ఇక్కడి బాంకులు వ్యాపార రహస్యాలను బయట పెట్టకుండా ఉంచడమే వీటి గొప్పతనం. రహస్యాలు బయట పెట్టడమనేది ఇక్కడ గొప్ప నేరం బయట పెట్టిన వారికి జైలుశిక్ష విధిస్తారు. లేకపోతే ఫైను వేస్తారు. బాంకు లేక ఆడిటరు రహస్య విధానాన్ని అంగీక రించాలి. బాంకులో కాతాదారుని వివరాలు బాంకులో అత్యున్నత ఉద్యోగులు ఒకరు ఇద్దరికి తప్ప మరెవ్వరికీ తెలియవు

స్విస్‌వారు ఈబాంకు విధానాన్ని అనాది కాలంనుంచీ అతి నైపుణ్యంగా ధర్మ బద్ధంగా అభివృద్ధి చేశారు. బాంకింగ్ వ్యాపార రహస్యం స్విస్ ధర్మం. మధ్య యూరప్‌లో గల ఈచిన్న దేశం ప్రపంచం అంతటా మిక్కిలి తక్కువ రేటు వడ్డీతో పెద్ద పెద్ద కాతాదారుల వద్దనుండి డిపాజిట్లను అంగీక రిస్తారు.

బాంకులో రహస్యాల వెల్లడికి ఆస్కారం లేకుండా ఇక్కడ సంఖ్యాత్మక కాతావద్ధతి ఉంటుంది. దీనివల్ల కాతాదారుని కాతాగురిం చిన వివరాలు ఇతరులకు తెలియవు. వారసత్వం వల్ల సంక్రమించవలసి వచ్చినప్పుడు, అప్పు సొమ్మును వసూలు చేసేటప్పుడు, దివాలా తీసినప్పుడు, అపరాధానికి పాల్పడి నప్పుడు మాత్రం స్విస్‌కోర్టులు కాతాదారుని వివరాలు తెలియజేయమని బాంకువారిని కోరవచ్చు. స్విస్ న్యాయశాస్త్రంప్రకారం పన్నులు కట్టకపోవడం, విదేశీమారకం నియమాల అతిక్రమణ లేక విదేశపన్ను చట్టాలను అతిక్ర మించటం నేరాలుకావు. కాబట్టి స్విస్‌బాంకులు కాతాదారుల కాతాల గురించి చెప్పనవసరంలేదు. వంద డాలర్ల సొమ్ముతో ఇక్కడ కాతాలు ప్రారంభించవచ్చు. 50 వేల డాలర్లు డిపాజిట్ల వరకు వడ్డీ ఇస్తారు. తరువాతి 50 వేల డాలర్లకు వడ్డీ ఉండదు. డిపాజిట్లు లక్షడాలర్లు దాటితే నెగిటివ్ వడ్డీ కడతారు. అంటే స్విస్ ప్రభుత్వం వారికి పన్ను చెల్లించవలసి వస్తుంది అందువల్ల నాలుగైదు స్విస్‌బాంకు లలో కాతాలు తెరుస్తారు. దానికి సదుపాయం ఉంది

చెక్కులమీద కాతాదారుడు సంఖ్యనే వ్రాయాలి పేరువ్రాయకూడదు. కొత్త కాతా దారులు ఒక విశ్వసనీయమైన లాయరుద్వారా కాతా ప్రారంభించవచ్చు.

## పనిలో అభినివేశం

ఏకాగ్రతతో [illegible] కృతజ్ఞత. ఆత్మవిశ్వాసంతో పని ప్రారంభించినప్పుడు శక్తి సామర్థ్యాలను వినియోగించుకుంటూ సత్ఫలితాలు లభిస్తాయి.

— వై.ఎస్.ఎన్.మూర్తి

"మృత్యుంజయుడు అంటే చనిపోకుండా ఎల్లకాలమూ ఉంటాడనికాదు. చావుని గురించి ఆలోచన లేనివాడూ, భయంలేనివాడూ మృత్యుంజయుడు."

— అమ్మ

# వనితాలోకం

## ఉపయోగకరమైన సూచనలు

కృత్రిమంగా తయారు చేసిన పువ్వులను ఒక కప్పు మెత్తటి ఉప్పుడున్న సంచిలో పడవేసి నాలుగైదు సార్లు ఆడిస్తే తాజాగా కనిపిస్తాయి.

* * *



క్రొత్త చీపురు మొదలు వేడి ఉప్పునీటిలో నానబెడితే చివర కుంచెలు బిరుసెక్కి చాలాకాలం మన్నుతుంది

* * *

దుమ్ముపట్టిన కుర్చీలు, సోఫాలు, బల్లలు శుభ్రం చేయటానికి వేడి నీటిలో ముంచిన దళసరి గుడ్డను పిండి వాటి మీద పరచి ఒక బెత్తంతో కొట్టండి. దుమ్మును తడి బట్ట లాగేస్తుంది.

* * *

నోటి దంతాలు తెల్లగా ఉండాలంటే నిమ్మ రసం, ఉప్పు కలిపి తోముకోండి. లేకపోతే మెత్తటి ఉప్పుతో పళ్ళు తోముకోండి.

* * *

అలారం గడియారాలను ఒక రేకుమీద పెడితే అలారం గట్టిగా వినిపిస్తుంది.

* * *

పెనంమీద కొంచెం ఉప్పుపొడివేసి వేడిచేసి పేపర్‌తో తుడిచి కడిగితే అవి శుభ్రంగా ఉంటాయి.

* * *

ఆకు కూరలు వండేటప్పుడు పంచదార ఒక చెంచాడు వేస్తే అవి ఆకుపచ్చగా కంటికి అందంగా కనిపిసాయి

* * *

మిరియాలుపొడి, పెరుగు కలిపి తింటే జలుబు తగ్గుతుంది

* * *

తేనెలో మిరియాలపొడిని మరియు తులసి ఆకురసము కలిపి తింటే దగ్గు, కఫము తగ్గుతుంది.

* * *

శరీరంమీద దురదగా ఉన్నప్పుడు మిరియాలు, వేపాకు కలిపి బాగుగా నూరి త్రాగితే దురద తగ్గుతుంది.

* * *

కాలిపోయిన స్థలముపై వెంటనే తేనెను పూస్తే బొబ్బలెక్కవు.

* * *

నెయ్యి తయారుచేసినపుడు తమలపాకులు వేసినట్లయితే నెయ్యి కొన్నిరోజుల వరకు ఉంచినా శుభ్రముగా ఉంటుంది.

* * *

అవనూనె, కిరసనాయిల్ సమపాళ్లలో కలిపి, అందులో ఒక గుడ్డను ముంచి ఆ గుడ్డతో కర్ర ఫర్నిచర్‌ను తుడిస్తే ఫర్నిచర్‌లో మంచి మెరుపుదనము ఏర్పడుతుంది.

* * *

ఉల్లిపాయలు తిన్న తరువాత ఒక చిన

"భగవంతుడు అన్నది నువ్వు పెట్టిన పేరు. కానీ ఆశక్తికి స్త్రీ, పురుష భేదం లేదు. దానిని భగవంతుడనే కాదు, ఇంకా ఏపేరైనా పెట్టు. ఉన్నది ఒకటే. దాన్నే సైన్సు స్వభావం అంటే, ఆధ్యాత్మికం దైవం అంటుంది." — ఆప

ూలకును లేదా ఎండు ధనియాలు నమిలితే ుల్లిపాయ వాసన పోతుంది

* * *

లవంగాలు నూరి నొసటిమీద పూస్తే తల ొప్పి తగ్గుతుంది.

* * *

ఆవ నూనెలో తెల్లుల్లి రెక్కలు వేసి బాగుగా ురుగనిచ్చి ఆ నూనెను చెవిలో వేసినట్లయితే ెవిలో కురుపులు, నొప్పిమొదలగు కర్ణ రోగములు ోతాయి.

* * *

అరటికాయ ముక్కలు, వంకాయ ముక్కలు ోరిగినవి బియ్యం కడిగిన నీటిలో వేస్తే ల్లబడవు.

* * *

పెనంపై ఉల్లిపాయ చెక్కతో ఒకసారి పామి ోసెలు వేసుకుంటే దోసెలు బాగావస్తాయి.

* * *

తులసి ఆకుల రసంలోతేనె కలిపి పుచ్చు ంటే జలుబు, దగ్గు నిమ్మళిస్తుంది.

* * *

తేనె, నిమ్మరసం సమభాగాలుగా పుచ్చు ుంటే కంఠం బొంగురు పోవడాన్ని, ఇతర ంఠరోగాల్ని తగ్గిస్తుంది.

* * *

తేనెను సున్నంతో రంగరించి పట్టువేస్తే ెణుకు నొప్పులు, కముకు దెబ్బ వావులు ోగ్గిపోతాయి.

* * *

రెండు కళ్లమీదా రెండు నందివర్ధన పువ్వుల ుంచుకుని పదినిమిషాలు కదలకుండా ుడుకుంటే కళ్లమంటలు తగ్గిపోతాయి.

* * *

బాగా పులిసిన మజ్జిగను రెండు, మూడు ార్లు పుక్కిలిస్తే నోటిపూత తగ్గుతుంది.

* * *

వేడినీటిలో పేరిన నెయ్యివేసుకుని త్రాగితే పొత్తికడుపునొప్పి తగ్గుతుంది

* * *

నల్లజీలకర్ర వేయించి ఒక చిన్నగుడ్డలో మూట కట్టి వాసన చూస్తే జలుబు తగ్గి పోతుంది

* * *

అద్దాలు తుడిచేటప్పుడు ఒకచిన్నకాగితం నీటిలోముంచి తుడవండి తెల్లగా మెరుస్తాయి

* * *

సన్నటిపూసలు సూదిలేకుండా దారానికి ఎక్కించడానికి దారం గోళ్ళరంగులో అద్ది ఆరాక గుచ్చండి

* * *

పురికొసతాళ్లు చుట్టబెట్టి అంట్లుతోమడానికి ఉపయోగించవచ్చు

●

**అభివృద్ధి చెందిన దేశాలకు 13,200 మానేజర్లు తరలిపోయారు**



భారతదేశంలో 1974 నుండి 1981 వరకు 13,200 మంది మానేజర్లు అభివృద్ధి చెందిన దేశాలకు వలసలు వెళ్లిపోయారు.

"నిర్మలమైన సరస్సులో రాయి విసిరితే అల్లకల్లోల తరంగాలు అంతటికీ విస్తరించు కుంటాయి. అదేవిధంగా ఇతరుల కష్టసుఖాలు, మనోభావాలు అందరం పరస్పరం పంచుకోవాలి."

# అంటార్కిటికాను గురించి కొన్ని వాస్తవ విషయాలు

కల్నల్ పి. గణేశన్

అంటార్కిటికా దక్షిణధృవం చుట్టూ ఇంచుమించు వర్తులాకారంలో ఉన్న ఖండము. పరిమాణంలో ప్రపంచవు ఖండాలలో అయిద వస్థానం ఆక్రమిస్తుంది. సుమారు ఆస్ట్రేలియాకు రెండు రెట్లు అధిక ప్రమాణంలో, యూరపుకంటే పెద్దదిగా ఉంటుంది

అంటార్కిటికా వైశాల్యము 14.3 మిలియను




చ కి.మీ.లు మొత్తం ఈ ప్రదేశం అంతా $1\frac{1}{2}$ కి.మీ. దళసరిగా మంచుతో కప్పబడి జంతు జాలం గానీ, మొక్కలుగానీ పెరగడానికి వీలులేకుండా ఉంటుంది. ఒక పరిశోధక వాయు విమానం రేడియో ఎకోసౌండింగ్స్ సాధనంతో అంటార్కిటికాలో అత్యధికం మంచు సాంద్రత 4.5కి.మీ.లు అని తెలుసుకున్నారు.

దీనికి దగ్గరగా ఉన్న ఖండము దక్షిణ అమెరికా నుండి అంటార్కిటికా 9 60 కి.మీ.ల దూరంలో ఉంటుంది. దక్షిణ అమెరికాకు ఉత్తర దిక్కుగా అంటార్కిటికాలో పొడవైన పర్వత ప్రదేశం విస్తరించుకుని ఉంటుంది. ఇచ్చట కొన్ని శిఖరాలు సముద్ర మట్టానికి 4,800 మీటర్లు పైగా ఎత్తుగా ఉంటాయి. ముఖ్యమైన ట్రాన్స్ అంటార్కిటిక్ పర్వతశ్రేణి ఖండంలో మధ్యగా ఉంటుంది. అంటార్కిటికాలో మౌంట్ ఇరిబస్ ఒక్కటే చైతన్యవంతంగా ఉండే అగ్నిపర్వతం.

ప్రపంచంలో మిక్కిలి శీతలంగా ఉండే ప్రదేశం అంటార్కిటికా. 13 మిలియను సంవత్సరాల నాటి మంచు దళసరిగా పేరుకుని ఉంటుంది వేసవిలో (సెప్టెంబరు నుండి మార్చి వరకు) ఉష్ణోగ్రతలు (−15 మొదలు - 30 డిగ్రీల సెంటిగ్రేడు) ఘనీభవ ఉష్ణోగ్రతకు క్రింద ఉంటాయి.

మార్చి మొదలు సెప్టెంబరు మాసం వరకు శీతాకాలంలో ఉష్ణోగ్రత - 40°c నుండి −70°C వరకు ఉంటుంది. నిరంతరం చీకటిగా ఉంటుంది నగటు ఉష్ణోగ్రత ఎప్పుడోగాని −18°c (0°F) ఉండదు.

జూలై 26, 1986న అత్యల్ప ఉష్ణోగ్రత -89.6° సెంటీగ్రేడ్ అంటార్కిటికాలో సోవియట్ స్టేషన్ వోస్టాక్‌లో రికార్డు అయింది.

(మిగతా 63 వ పేజీలో)

## జపాన్‌లో పఫర్ ఫిష్

[illegible]

"వాస్తవానికి సత్యం ఒక్కటే. కానీ దాన్ని ఆత్మగత దృక్పథం నుంచి పరిశీలించినప్పుడు దాన్నే మతం అనిపిలుస్తాం."

# హెలికాప్టర్

ఎయిరో ప్లేను (వాయువిమానం) కంటే ఎక్కువ అనుకూలవంతంగా తిరగడానికి అనువుగా ఉంటుంది హెలికాప్టర్ దీనిని 1907 లో ఫ్రాన్స్‌లో కోర్నస్ (Cornoe) కనిపెట్టాడు.

హెలికాప్టర్లు వాటి పరిమాణవు వైశాల్యంలో భూమినుంచి పైకి, పైనుంచి భూమి మీదికి దిగగలవు ఇవి ఏదిక్కుగానైనా వెనుకకు,



ప్రక్కలకు కూడా ఎగురగలవు నిటారుగా పైకి వెళ్లగలవు. గాలిలో స్థిరంగా ఉండగలవు

హెలికాప్టర్లకు ఒకపెద్దహారిజాంటల్ రోటారు (తిరిగే రెక్క) పైన తిరుగుతూంటుంది. సామాన్యమైన ఎయిర్‌ప్లేన్ రెక్కలాగే రోటారు హెలికాప్టరును పైకి ఎత్తుతుంది. రోటారు వేగాన్ని మార్చుటవల్ల మరియు బ్లేడుల కోణాన్ని మార్చుటవల్ల పైలట్ హెలికాప్టరుని పైకి క్రిందికి వెళ్ళేటట్టు లేక ఒకే చోట తిరిగేటట్టు చేస్తాడు. స్పిన్నింగ్ రోటార్‌ను కదుపుతూ హెలికాప్టర్ మార్గాన్ని నియంత్రించవచ్చు. హెలికాప్టర్ వెనుక భాగంలో ఒక రోటారు మెయిన్ రోటార్‌కు ఎదురుగా సమకోణంలో ఉంటుంది. స్పిన్నింగ్ బ్లేడులు హెలికాప్టరును అదుపులో ఉంచుతాయి

కొన్ని హెలికాప్టర్లలో వరుసగా ఒకదానిప్రక్క ఒకటి లేక ఒకదానిపైఒకటి రెండురోటార్లు అమర్చబడి ఉంటాయి. ఒకే రోటార్ హెలికాప్టర్ సాధారణమైనది చిన్న హెలికాప్టర్లకు పిస్టన్ ఇంజనులు అమరుస్తారు. మిక్కిలి అధిక శక్తివంతమైన హెలికాప్టర్లు గాస్ టర్బైన్లతో తిరుగుతాయి. వీటినే టర్బో కాప్టర్స్ లేక జెట్ హెలికాప్టర్లు అంటారు వీటిని ముఖ్యంగా సైనికులు ఉపయోగిస్తారు. వీటిలో కొన్ని గంటకు 320 కి.మీ ల పైబడిన వేగంతో ఎగురుతాయి.

సముద్రంలో ఆపదలో చిక్కిన వారిని రక్షించడానికి హెలికాప్టర్లు ఉపయోగించ బడతాయి. రోడ్ల రవాణా సౌకర్యంలేని చోట పెద్దపెద్ద భారాలను చేరదీయడానికి, సైనికులను యుద్ధభూమికి చేర్చడానికి, ఎరువులు చల్లడానికి, కీటకనాశిని మందులను, కలుపు నాశిని మందులను చల్లడానికి దీనిని ఉపయోగిస్తారు. విత్తనాలు చల్లడానికి కూడా హెలికాప్టర్లు ఉపయోగపడుతున్నాయి

(మిగతా 56 వ పేజీలో)

**STATEMENT ABOUT OWNERSHIP AND OTHER PARTICULARS ABOUT NEWSPAPER "WISDOM" MADRAS-600 004**

FORM IV (See Rule 8)

| | | |
|---|---|---|
| 1 | Place of Publication | MADRAS |
| 2 | Periodicity of Publication | MONTHLY |
| 3 | Printer s Name | K V GOVINDA RAO |
| | Nationality | INDIAN |
| | Address | Printed at M/s Desh Publications (P) Ltd 267-B Royapettah High Road Madras - 600 014 |
| 4 | Editor s & Publisher s Name | K V GOVINDA RAO |
| 5 | Nationality | INDIAN |
| 6 | Address | 9, Desika Road Mylapore, Madras - 600 004 |
| 7 | Name & Address of individuals who own the Newspaper and partners | WISDOM PUBLICATIONS 9 Desika Road Mylapore Madras - 600 004 |

I K V GOVINDA RAO hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief

Dated 1-3-90
Madras - 600 004

(Sd) K.V GOVINDA RAO
Editor & Publisher
"WISDOM"

"ప్రజా సంక్షేమం కోసం, దేశం మేలుకోసం ఆచరణలో ఏకత్వానికి భావాల్లో బాహుళ్యత అవరోధం కాబోదు."

# తెలుగు నవల

## సీతా రవిచంద్రన్

దేశ కాలానుగుణ్యంగా మానవుని ప్రగతి బహుముఖంగా ఉంటుంది. బహుముఖంగా ప్రభవించిన ప్రగతి సంస్కృతి. మత సాంప్రదాయాలు, సాహిత్యము, వాస్తు, శిల్పకళ, చిత్రకళ, సంగీతం, నృత్యం, నాటకం మొదలైన వన్నీ సంస్కృతికి రూపం కల్పిస్తాయి.



చిలకమర్తి

తెలుగు భాష (తెనుగు, ఆంధ్రము)లో అవతరించిన సారస్వతము, తెలుగు సాహిత్యము. ఇదే తెలుగు వాఙ్మయం. వస్తువు ఏదైనా రచనా ప్రక్రియ ఎట్లున్నా - అది రసానంద జనకమైతే అది సాహిత్యం అనిపించుకుంటుంది. సాంఘిక, ఆర్థిక, రాజకీయ పరిస్థితులను దృష్టిలో పెట్టుకుని రచయితలు సాగించిన రచనలు సాహిత్యంలో వివిధ ప్రక్రియలుగా రూపొందుతాయి.

11వ శతాబ్దంలో నన్నయ మొదలు నేటి వరకూ తెలుగులో వివిధ ప్రక్రియలు ఆవిర్భవించాయి. భారతీయ విజ్ఞాన సర్వస్వం అని చెప్పుకోదగిన సంస్కృత భారతాన్ని ప్రభువు ప్రోత్సాహం మీద వైదిక మత ఉద్ధరణకు నన్నయ భట్టారకుడు తెలుగులోకి అనువదించాడు. శైవమత ప్రచారానికి దేశీ కవితా మార్గంలో శివకవుల పండితారాధ్య చరిత్రము, బసవ పురాణము వంటి ద్విపద గ్రంథాలు బయలుదేరాయి. తిక్కన కాలంలోను, ఆ తరువాత సంస్కృత పురాణాలు ఆంధ్రీకరింపబడ్డాయి. అనేక కథాకావ్యాలు ఉద్భవించాయి. తెలుగు సాహిత్య చరిత్రలో స్వర్ణయుగం అని చెప్పుకోదగిన 16వ శతాబ్దంలో అనేక ప్రబంధాలు వెలువడ్డాయి. క్షేత్ర మహాత్మ్యాలు, ద్వ్యర్థికావ్యాలు, త్ర్యర్థి కావ్యాలు, కల్పిత కథా కావ్యాలు, శ్లేష కావ్యాలు, శుద్ధాంధ్ర కృతులు, నిరోష్ఠ్య చిత్రకావ్యాలు వచ్చాయి. 17-18 శతాబ్దాలలో తంజావూరు, మధుర, పుదుక్కోట సంస్థానాలలో తెలుగు సాహిత్యంలో యక్షగానాలు, కీర్తనలు, పదాలు, మోహ శృంగారాత్మకమైన కావ్యాలు, వచనకావ్యాలు, చిత్రకావ్యాలు, దండకాలు, శతకాలు, ఛందోవ్యాకరణాలంకార లక్షణ గ్రంథాలు, నిఘంటువులు వచ్చాయి. 18వ శతాబ్దం వరకు వెలసిన ప్రాచీన సాహిత్య ప్రక్రియ సంస్కృత భాషా ప్రభావితము. ముఖ్యంగా రాజాశ్రితము. సాహిత్యమంతా పండితైక వేద్యంగా ఉండేది.

**ఎక్కువగా పెరిగిపోతున్న చెత్తాచెదారం**

19వ శతాబ్దం నుంచి నేటివరకూ కొనసాగుతూన్నది నవ్యసాహిత్య ప్రక్రియ స్వాతంత్ర్యానికి ముందు దేశం ఆంగ్లేయుల పాలనలో ఉంది ఆంగ్లేయుల వల్ల, వారి సాహిత్య సంపర్కం వల్ల, జాతీయ భావప్రేరణ వల్ల, ఆలోచనా సరళిలో అనేక మార్పులు వచ్చాయి ఇది పాశ్చాత్య భాషా ప్రభావితం ప్రజాశ్రితము, జన సామాన్య వేద్యము ఈ నవ్య సాహిత్య ప్రక్రియలో కథలు, కథానికలు, నవలలు, ప్రహసనములు, స్వీయచరిత్రలు, వ్యాసాలు, ఉపన్యాసాలు, విమర్శనలు బయలుదేరాయి 11వ శతాబ్దంనుంచి ప్రవృద్ధిపొందుతూ వచ్చిన సువిశాల సాహిత్య ప్రక్రియలో 19వ శతాబ్దం చివరి భాగంలో (1872) నవల ఉద్భవించింది. దక్షిణాది భాషలలో తెనుగే నవలా రచనలో ముందంజ వేసింది. నవల ఒక విశిష్టమైన సాహిత్య ప్రక్రియ. కల్పనలతో కూడిన ఒక దీర్ఘమైన ఊహానిర్మిత కథ లేక చరిత్రాత్మక కథ. వాస్తవ జీవితానికి సంబంధించిన స్త్రీ, పురుష పాత్రలు, సన్నివేశాలు కలిగి ఉంటుంది. ఇంగ్లీషు భాషతో పరిచితులైన మన దేశీయులను ఆ భాషలో నావెల్ (Novel) ఎక్కువగా ఆకర్షించింది సంఘంలో అనేక సమస్యలు బయలుదేరాయి స్వాతంత్ర్యం సంపాదించాలనే తపన ఏర్పడింది స్త్రీవిద్య పునర్వివాహం, బాల్య వివాహం మొదలైన వాటిని సంస్కరించాలనే భావన ఏర్పడింది. రాజా రామమోహన్ రాయలు, కందుకూరి వీరేశలింగం పంతులు, ఈశ్వరచంద్ర విద్యాసాగర్ వంటి సంస్కరణ కర్తలు బయలుదేరారు. సంఘ సంస్కరణతో పాటు భాషా విషయకంగా కూడా వీరు ఎన్నో మార్పులు తీసుకు వచ్చారు ఈ మార్పువల్ల సాహిత్య సాగరంలో ఉద్భవించింది నవల మొదటి రోజులలో ఈ నవలని నవీన ప్రబంధమని, వచన ప్రబంధమని, ఆఖ్యాయిక అని పిలిచేవారు గుజరాతీ, మహారాష్ట్ర, కన్నడ భాషలలో నవలను కాదంబరి అంటారు తెలుగులో మాత్రం ఇంగ్లీష్ 'నావెల్' అనే పదాన్ని తద్భవం చేసుకుని నవల అని పిలుస్తున్నాము

1864 లో కొక్కొండ వెంకట రత్నం పంతులు గారు ప్రకటించిన 'మహాశ్వేత' సంస్కృత భాషలోని 'కాదంబరి'కి తెలుగు అనువాదము. ఇదే మొదటి నవల అని కొందరు అంటారు అటు తరువాత 1872లో నరహరిశెట్టి గోపాల కృష్ణశెట్టిగారు రచించిన 'శ్రీరంగ రాజచరిత్ర' సమకాలిక జీవిత చరిత్ర ఇదే మొదటి నవల అని మరికొందరి అభిప్రాయం ఏదెట్లున్నా 1878 లో కందుకూరి వారు రచించిన 'రాజశేఖర చరిత్ర' తెలుగులో స్వతంత్ర్యమైన నవలా రచనకు దారి చూపింది దీనికి మరో పేరు 'వివేక చంద్రిక'. ఆనాటి ఆంధ్రదేశ సాంఘిక పరిస్థితులకు రాజశేఖర చరిత్ర దర్పణము వంటిది

వీరు రచించిన మరియొక నవల సత్యరాజా పూర్వదేశయాత్రలు. శ్రీపంతులుగారు ప్రప్రథమ నవలను వ్రాయడమే గాక అటువంటి నవలలు

( 54 వ పేజీ తరువాయి)

V-12 అని చెప్పబడే సోవియెట్ Mil Mi-12 హెూమర్ ప్రపంచంలో మిక్కిలి పెద్ద హెలికాప్టర్ దీనిభారం 103 3 టన్నులు ఇది నాలుగు 6500-hp టర్బోషాఫ్ట్ ఇంజన్లతో నడుపబడుతుంది 37 00 మీటర్ల రోటారు అంచుల నుండి దీని నిడివి 67 మీటర్లు.

మే 1971లో రక్షణ కార్యక్రమంలో ఎవరెస్ట్ శిఖరానికి ఈశాన్యదిక్కుగా 7,000 మీటర్ల ఎత్తుమీద దిగడం హెలికాప్టర్ రికార్డు లాండింగ్.

"పురుషార్థ సాధకాలైన ధైర్యసాహసాలు లేకుండా సందేహాలతో తికమకలు పడేవారికి శాంతి, సుఖం, ఆనందం ఉండవు."

అనేకం తెలుగులో రావడానికి 'చింతామణి' అనే పత్రికను స్థాపించి (1892-99) నవల రచనను ప్రోత్సహించారు ఈపత్రికలో నవలా రచనకు నిబంధనలను ప్రకటించారు. వీటిని అనుసరించి కవులలో రచనా వ్యాసంగం అధిక మైంది చింతామణి పత్రిక ప్రకటనను అనుసరించి రామచంద్ర విజయము, హేమలత, అహల్యాబాయి, సౌందర్యతిలక, కర్పూర మంజరి మొదలైన ఉత్తమ నవలలు రచించిన శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహం గారు, వివేక విజయం రచించిన గొటేటి కనకరాజుగారు, త్రివిక్రమవిలాసం రచించిన టేకుమళ్ల రాజగోపాలరావు, సంజీవరాయ చరిత్ర వ్రాసిన తల్లాప్రగడ సూర్యనారాయణ రావుగారు, ధర్మవతీ విలాసం, మాలతీ రాఘవము మొదలైనవి రచించిన ఖండవల్లి రామ చంద్రుడు మొదలైనవారు బహుమతులను పొందారు ముఖ్యంగా వీరు రచించిన నవల లలో ఎక్కువ భాగము ఇతర ప్రాంతాల చరిత్రకు ప్రాముఖ్యతనిచ్చారు

ఆంధ్రదేశపు చరిత్ర కథలకు ప్రాధాన్యమివ్వాలనే తలపుతో ఇటువంటి రచనలకు పోటీలు పెట్టి కొమర్రాజు వెంకట లక్ష్మణ రావుగారు విజ్ఞాన చంద్రికా మండలిని ప్రారంభించి తెలుగులో చరిత్రకు సంబంధించిన నవలల రచనను ప్రోత్సహించారు ఆనాడు విజ్ఞాన చంద్రికా మండలివారు 'విజయనగర సామ్రాజ్యము' (దుగ్గిరాల రాఘవ చంద్రయ్యగారు), 'విమలాదేవి' 'అస్తమయము' (భోగరాజు నారాయణమూర్తిగారు), 'రాయచూరు యుద్ధము' (కేతవరపు వెంకట శాస్త్రి) ప్రకటించారు ఆంధ్ర ప్రచారిణీ, సరస్వతి, వేగుచుక్క, రామవిలాస గ్రంథమాలలద్వారా అనేక చారిత్రక నవలలు వచ్చాయి. అడవి బాపిరాజుగారు హిమబిందు (సాతవాహనులనాటి కథ), గోనగన్నారెడ్డి (కాకతీయుల నాటికథ) రచించారు వీటిలో ముఖ్యంగా అనాటి చారిత్రక పరిస్థితులతోపాటు ఆకాలపు ఆచార వ్యవహారాలు, కాల విజ్ఞానము, అభిరుచులు గోచరిస్తుంటాయి. విశ్వనాథ సత్యనారాయణ గారు ఏకవీర, ధర్మచక్రము, వేయిపడగలు, కడిమిచెట్టు మొదలైనవి రచించారు. వీరి ఏకవీర విశిష్టశైలితో ఉంటుంది దేశస్వాతంత్ర్యం సిద్ధించిన తరువాత నవల రూపురేఖలు సిద్ధించుకుని పరిపూర్ణతను పొందింది నోరి నరసింహశాస్త్రి గారి (నారాయణ భట్టు, రుద్రమదేవి) నేలటూరి వెంకట రమణయ్యగారి (మధుమావతి, ఛత్రగ్రాహి) తెన్నేటి సూరి (చెంగిజ్ ఖాన్) మొదలైన రచయితలు వచ్చారు. ఆంధ్రవిశ్వవిద్యాలయంవారు పోటీలు పెట్టి క్రొత్త నవలలకు దోహదం కలిగించారు.

## ఏనుగు నాడి నిమిషానికి 25 సార్లు కొట్టుకుంటుంది



పెరిగిన మానవుని నాడి నిమిషానికి 75 సార్లు కొట్టుకుంటుంది. ఒకచిన్న ఎలుకనాడి నిమిషానికి 200 సార్లు కొట్టుకుంటుంది-ఇది ఆకారంలో చిన్నగా ఉండడంవల్ల ఎక్కువ వేడిని వినియోగించుకుంటుంది కాబట్టి ఏనుగు నాడి నిమిషానికి 25 సార్లు మాత్రమే కొట్టుకుంటుంది.

"పరిస్థితులతో రాజీపడి సర్దుకు పోవడం కాదు,
అవసరమైనప్పుడు దృఢంగా వ్యవహరించడమే మానవత్వము."

అందులో మల్లాది వసుంధర (తంజావూరి పతనం, దూరపు కొండలు), ధూళిపాళ శ్రీరామమూర్తి, పిలకా గణపతి శాస్త్రిగారు నవలలు రచించారు. నవల అవతరించిన సమయంలో కాగితం చౌక, పాఠకుల సంఖ్యా అధికం ఆ కాలంలోనే ఆంధ్ర ప్రచారిణీ గ్రంధమాల వెలసింది తెలుగు వాతావరణంతో పొదగబడిన నవలలు వేలకు వేలు వచ్చాయి సరస్వతీ గ్రంధమాల వెలసింది. వాడుక భాషలో అనేక అనువాదాలు, అనుకరణలు నవలలుగా ఉద్భవించాయి. ప్రభాత్ కుముద్ ముఖోపాధ్యాయ బెంగాలీ నవలకు శివశంకర శాస్త్రిగారి 'కుంకుమ భరిణి' తెలుగు అనువాదము. చలంగారి శశిరేఖ, దైవమిచ్చిన భార్య, మైదానం, కన్నీటి కాలువ, బ్రాహ్మణీకం మొదలైన నవలలు స్త్రీ పురుషుల స్వేచ్ఛా జీవనము శ్రేయోదాయకమని ప్రతిపాదించాయి. వీరు ప్రతిపాదించిన స్వేచ్ఛా ప్రణయం విప్లవాత్మకమైనది.

1872 నుండి నేటివరకు నవలా సాహిత్యం రకరకాల ఇతివృత్తాలతో వివిధ సంస్కరణలకు ప్రాతినిధ్యం వహించింది. 1872-1920 వరకు ప్రారంభదశలో వ్యక్తి సంస్కారం, నీతి ప్రాధాన్యం, నూతన విజ్ఞానం ముఖ్యం పరంపరాగత మూల్యాల శైథిల్యం వస్తువుగా వీరేశలింగం, చిలకమర్తి, వేంకటపార్వతీశ కవులు నవలలు రచించారు. ఈ ప్రారంభయుగాన్నే అనువాద యుగం లేక చారిత్రక నవలాయుగం అని చెప్పుకోవచ్చు.

తరువాత 1920 నుండి 1947 వరకు ఉన్నవ, విశ్వనాథ, చలం, బాపిరాజుగార్ల నూతన మూల్యాల అన్వేషణతో, ఆత్మ విశ్వాస స్ఫురణతో, ప్రణయతత్త్వ విచారణతో జాతీయోద్యమంలో అనేక నవలలు వచ్చాయి. దీనినే వికాసయుగం అని చెప్పుకోవచ్చు.

## ష్లీమాన్ ట్రాయ్ ప్రదేశాన్ని కనుగొన్నాడు



సుమారు ఒక శతాబ్దం ముందు సుప్రసిద్ధ జర్మన్ వ్యాపారస్థుడు మరియు పురాశిల్పా వస్తు శాస్త్రజ్ఞుడు అగు హీన్రిఖ్ ష్లీమాన్ ట్రాయ్‌ప్రదేశాన్ని హెలెన్ నగరాన్ని, హోమర్‌ట్రోజన్ యుద్ధ ప్రదేశాలను కనుగొన్నాడు. ఇది ఈనాడు ఆధునిక టర్కీ ఏజియన్ తీర ప్రదేశంలో ఉంది. చివరగా *1932-1938* సంవత్సరాల మధ్య కార్ల్ డబ్ల్యు.బ్లెగెన్ మరియు సిన్‌సినాట్టి యూని వర్సిటీలో పురాశిల్పా వస్తు శాస్త్రజ్ఞులు ట్రాయ్‌లో పరిశోధనలు చేసారు. ఆనాటి నుండి ఈప్రదేశం పూర్తిగా ధ్వంసం చేయబడింది. అనధికార పూర్వకంగా ఇప్పుడు అనేక మంది త్రవ్వకాలు ప్రారంభించారు. పురాశిల్పా వస్తు పరిశోధనలకు డయామ్లర్ బెంజ్ ఒక కొత్తరకం యునిమాగ్ జీప్‌ను తయారు చేసారు. దీనినే "ఆర్కియోమొబైల్" అన్నారు. ముఖ్యంగా ట్రాయ్ మరియు ఇతర ప్రదేశాలలో త్రవ్వకాలకు, డ్రిల్లింగులకు దీనిని ఉపయోగించారు. ప్రొ.మాన్‌ఫ్రెడ్‌కోర్ఫ్‌మాన్ చెప్పిన ప్రకారం ట్రాయ్‌లో ఇంకా అనేక రహస్యాలు బయట పడలేదు. పురాశిల్పా వస్తు శాస్త్రజ్ఞులు మరో శతాబ్దం పాటు అతి సౌలభ్యంగా ఇక్కడ త్రవ్వకాలు, పరిశోధనలు చేయవచ్చు అని వీరు చెబుతున్నారు.

—జర్మన్ ఫీచర్స్ సౌజన్యంతో

"మనసులోని మాలిన్యాన్ని మటుమాయం
చేసుకోగల మానవుడే ప్రజ్ఞాధనుడు"

1947-1960 వరకు మనోవైజ్ఞానిక యుగంగా చెప్పబడిన ఈ యుగంలో నవల పరిధి మరింత విస్తృతం అయింది నవలలో మనో విశ్లేషణ, అంతర్బహిర్జగత్తుల సంఘర్షణ, మానవుని లౌకిక లక్షణం ప్రాధాన్యత వహించాయి ఈ యుగంలో గోపీచంద్, బుచ్చిబాబు, నోరి నరసింహశాస్త్రి, కుటుంబరావు మొదలైన నవలా రచయితలు ప్రసిద్ధి వహించారు

1960 నుంచి నేటివరకూ ఇటీవలి దశలో రాచకొండ విశ్వనాధశాస్త్రి, శ్రీదేవి, లత, బలివాడ మొదలైన వారు కొన్ని ప్రసిద్ధ నవలలను రచించారు ఈ యుగంలో రచయితలతో పాటు రచయిత్రులు కూడా అధికంగా నవలలు వ్రాయడం ప్రారంభించారు. స్త్రీ పాఠక సంఖ్యా అధికం అయింది వాసిరెడ్డి సీతాదేవి, లత, ముప్పాళ రంగనాయకమ్మ ఇంకా అనేక మంది తిరుగుబాటు ధోరణిలో అనేక నవలలు వ్రాసారు వీరు ముఖ్యంగా స్త్రీలకు ఇంకా స్వేచ్ఛ ఉండాలని, ఆలోచనా ధోరణిలో అభివృద్ధి ఉండాలని అంటూ చెప్పదలచుకున్న భావాలను ప్రత్యక్షంగానో, పరోక్షంగానో తమతమ రచనలలో స్పష్టంగా రచించారు అనేక వారపత్రికలు, మాసపత్రికలు నవలలకు ప్రోత్సాహమిస్తున్నాయి మధ్య తరగతి కుటుంబ కథలను ఇతివృత్తంగా గ్రహించి వ్రాయడం ప్రారంభించారు

పుస్తకాన్ని చదివింప జేయడంలో కథకు ప్రాధాన్య మిచ్చేవి అపరాధ పరిశోధక నవలలు వీటిని ముఖ్యంగా పాశ్చాత్య భాషల నుండి తెలుగువారు అనేకం అనువాదాలు చేసారు సాంఘిక నవలలు లాగే రాజకీయ సమస్యలను ప్రతిబింబిస్తూ అనేక నవలలు ఉన్నాయి నేడు పత్రికలలో దారావాహిక నవలలు ప్రచురింపబడుతున్నాయి హాస్యరస ప్రధానంగా నవలలు వెలువడ్డాయి శాస్త్ర విజ్ఞానంతో పాటు మనోవిజ్ఞాన శాస్త్రం బ్రహ్మాండంగా అభివృద్ధి పొందింది ఫ్రాయిడ్, జేమ్స్‌జాయిస్, జీన్‌పాల్ సార్త్రె మున్నగువారు నవల రచనలో విప్లవం సాగించారు ఈ పద్ధతిలో చాలా తెలుగు నవలలు వచ్చాయి వస్తున్నాయి రధానిర్మాణంలోను, సన్నివేశముల పేర్పులోను విశిష్టమైన నవలలు వెంకట పార్వతీశ కవులు, జొన్నలగడ్డ వారు, తాపీ ధర్మారావు గారు, ఆడుద్ర, శారద, ఒంపోరావు, కొమ్మూరి సాంబశివరావు గారు రచించారు ఇంగ్లీషులో ఎన్నిరకాల నవలలు ఉన్నాయో అన్నిరకాలు తెలుగులో వచ్చాయి అనువాదాలు, అనుకరణములు, స్వతంత్ర రచనలు, జేబునవలలు, రైల్వేనవలలు అనేకం వచ్చాయి

●

## హెక్టేరుకి అధిక దిగుబడి పొందాలంటే?



పొలంలో అధికంగా దిగుబడిని పొందాలంటే తగుమాత్రం ఎరువు వినియోగం ప్రోత్సహించాలి. ఇప్పుడు మనదేశంలో హెక్టేరుకి సరాసరి ఎరువుల వాడకం 46 కి.గ్రాలు. ఎరువుల వినియోగం నాగాలాండ్‌లో హెక్టేరుకి 25 కి.గ్రాలు అయితే పంజాబులో 151 కి.గ్రాలు, పాండిచ్చేరిలో 231 కి.గ్రాలు

—'యోజనా' సౌజన్యంతో

"వినదగు నెవ్వరుచెప్పిన వినినంతనే వేగపడక వివరింపదగున్,
కనికల్ల నిజము తెలిసిన మనుజుడె పో నీతిపరుడు."

# గొరిల్లా

## ఉషానాథ్

గొరిల్లా మిక్కిలి పెద్ద శరీరం, భయంకర మైన రూపముగల ప్రాణి. అతి స్థూలంగా భయోత్పాతంగా కనిపించినా సాధారణంగా గొరిల్లాలు అతిశాంతియుతంగా జీవితం గడువు కుంటాయి.

గొరిల్లాలు మానవజాతికి అత్యంత సన్నిహిత మైనవని ఆధునిక జీవరసాయనిక శాస్త్ర పరిశోధనలు తెలియజేస్తున్నాయి. దీనిని అనుసరించి గొరిల్లాలను మానవజాతి (హెమినిడే) క్రింద విభజించారు.



అడవిలో బాగాపెరిగిన మగగొరిల్లా 170 సెం.మీ.ల ఎత్తుగా ఉండి, 160-250 కి.గ్రా.లు భారం తూగుతుంది. కానీ వీటిని పట్టుకుని పెంచినప్పుడు గొరిల్లాలు అతి స్థూలంగా పెరిగిపోయి 340 కి.గ్రా.ల భారం వరకూ తూగుతాయి. ఆడగొరిల్లాలు సాధారణంగా 1 50 సెం.మీ.ల ఎత్తుగా ఉండి సుమారు 90 కి.గ్రా.ల బరువు ఉంటుంది.

గొరిల్లాలు పుట్టుక నుంచి కారునలుపు రంగులో ఉంటాయి. వెంట్రుకలు నల్లగాగానీ, కొంచెం ఎరుపురంగులోగానీ ఉంటాయి. బాగా పెరిగిన మగ గొరిల్లాల వీపుమీద తెల్లటి వెండి రంగు మోపురం ఉంటుంది. దీనిమీద వెంట్రుకలు ఇతర భాగాలమీద వెంట్రుకలు కంటే పొట్టిగా ఉంటాయి. వయస్సు ముదిరిన కొద్దీ మగ, ఆడ గొరిల్లాలు బూడిద వర్ణంగా మారతాయి.

గొరిల్లాకి బాగా ఒత్తుగా పెరిగిన దట్టమైన కనుబొమలు, పొట్టికాళ్లు, నిడుపాటి భుజాలు, పెద్దపెద్దచేతులు, పాదాలు ఉంటాయి. ఇవి నాలుగు కాళ్లమీద నడుస్తాయి. ముఖ్యంగా ముందు శరీరభాగం అంతా మోకాళ్లమీద మోపి నడుస్తాయి. తలముందు భాగము విశాలంగా ఉంటుంది. చెవులు మాత్రం చిన్నవిగా తలకు అంటి ఉంటాయి.

గొరిల్లాలు ఉష్ణమండలపు అడవులలోను, మధ్య ఆఫ్రికా పర్వతప్రదేశాలలోను నివసిస్తాయి. పెద్ద శరీరం ఉండటంవల్ల ఇవి సాధారణంగా భూమిమీద తింటూ సంచరిస్తాయి. దవడలు చాలా బలిష్ఠంగా ఉండడంచేత గట్టిచెట్లబెరడు, లావుపాటి కొమ్మలు, వ్రేళ్లు, ఆకులు, కాయలు, పళ్లు తింటాయి. పగటిపూటంతా పచ్చిఆకులు, తీగలు తింటూ సంచరిస్తాయి.

ఇవి అభ్యాసాన్ని అనుసరించి 5 మొదలు 30 గొరిల్లాలు గుంపులు, గుంపులుగా నివసిస్తాయి కానీ కొన్ని పెద్దగొరిల్లాలు ఒంటరిగా అడవులలో విచ్చలవిడిగా తిరుగుతూంటాయి. వీపు తెల్లగా ఉండే సిల్వర్‌బాక్ గొరిల్లా గుంపుకి నాయకుడిగా ఉంటూ ఆగుంపును రక్షిస్తుంది.

"విన్నదానిని మననం చేసుకోడం వివేకుల లక్షణం."

నాయకుడిగా ఉండే గొరిల్లా హత్యచేయబడ్డప్పుడు గుంపులో తక్కిన గొరిల్లాలు అన్నీ ఎటువంటి ఆటంకం కలిగించకుండా హత్యను కోరుకుంటాయి.

గొరిల్లా గుంపులు విచ్చలవిడిగా 7 మొదలు 25 చ.కి.మీ.ల వైశాల్యంలో తిరుగుతాయి. సూర్యాస్తమయం అయిన తరువాత ఎక్కడ ఉంటే అక్కడ సంధ్యవేళ గూటిని నిర్మించు కుంటాయి. భూమిమీద లేక చెట్లమీద ఆకుల తోను, కొమ్మలతోను పడకను తయారు చేసు కుంటాయి. ప్రతీరోజు సాయంకాలం ఎప్పటి కప్పుడు ఈ పడకలను ఏర్పాటు చేసుకుంటాయి. మూడు సంవత్సరాల లోపు పిల్లగొరిల్లాలు తల్లి మాటున ఉంటాయి. తల్లి ప్రక్కనే పడు కుంటాయి.

గొరిల్లాలకు ప్రత్యేకంగా జతకట్టే కాలం ఉండదు. సాధారణంగా 260 రోజులు గర్భం ధరిస్తాయి. క్రొత్తగా పుట్టిన గొరిల్లాలు 1.8 మొదలు 2.3 కి.గ్రా.లు బరువు ఉంటాయి. సాధారణంగా బూడిద వర్ణము చేరినఎరుపు రంగులో ఉంటాయి. తలమీద బొద్దుగా వెంట్రుకలు పెరిగి ఉండవు. కొద్దిరోజులలోనే చర్మం నలుపెక్కి పోతుంది. సాధారణంగా మొదటి లేక రెండవవారంలో చిన్నగొరిల్లాలు కళ్లు తెరుస్తాయి. 9 వారాలకు ప్రాకటం మొదలు పెడతాయి. 9వ నెలకు బాగా నడవడం ప్రారంభిస్తాయి. చిన్న చిన్న గొరిల్లాలు మూడు సంవత్సరాలు వచ్చేదాకా తల్లిని అంటిపెట్టుకునే ఉంటాయి. తల్లి గొరిల్లాలు పిల్లలను చాలాప్రేమగా చూసుకుంటాయి ఏ అపాయం రాకుండా రక్షిస్తూంటుంది.

ఆడగొరిల్లాలు 6 సంవత్సరాలకు, మగ గొరిల్లాలు 7 లేక 8 సంవత్సరాలకు పెద్దవి అవుతాయి. కానీ 14 సంవత్సరాల వయస్సు వచ్చేవరకు మగవి పెరుగుతుంటాయి. గొరిల్లాలు మానవుని వల్ల ఏ అపాయం లేకుండా ఉంటే 40 లేక 50 సంవత్సరాలు జీవిస్తాయి.

అడవులలోను, ఇతర ప్రదేశాలలోను వీటినివాసయోగ్యమైన ప్రదేశాలు నశించి పోవడం వల్ల ఈ జాతి బాగా తగ్గిపోయింది. అన్నిటికంటే బలవంతంగా వీటిని జూలలో పెట్టడం వల్లే ఇవి ఎక్కువగా నశించిపోతున్నాయి జూలలో ఉంచబడే ప్రతీ ఒక్కొక్క గొరిల్లాకి అధమం 50 గొరిల్లాలు చంపబడుతున్నాయి

-'సిఇఇ ఎన్ ఎఫ్ ఎస్' సౌజన్యంతో

## గబ్బిలాలు రాత్రి ఎగిరే కీటకాలను తింటాయి



[illegible]

"సుఖానికి పొంగక, దుఃఖానికి క్రుంగక నిలిచినవాడే-
ధీరోదాత్తుడైన నాయకుడు."

# వీరిని గురించి తెలుసుకోండి

విలియం గిల్‌బర్ట్ గ్రేస్ (1848-1915) ఇంగ్లీషు క్రికెట్ యోధుడు మరియు సుప్రసిద్ధ వైద్యుడు క్రికెట్ జీవితంలో ఇతడు మొత్తం 54,904 పరుగులు చేసాడు 126 సెంచురీలు కొట్టాడు 2876 వికెట్లు తీసాడు

* * *

సర్‌జాక్ హాబ్స్ (1882-1963) ఇంగ్లీషు క్రికెట్ ఆటగాడు మరియు ఒపెనింగ్ బాట్స్‌మన్. ఇతడు చేసిన 61,237 పరుగులలో 5,410 పరుగులు 61 టెస్ట్ మాచ్‌లలో చేసాడు 197 సెంచురీలు కొట్టి రికార్డు స్థాపించాడు

* * *

జానీ వీస్ ముల్లర్ గొప్ప ఈతగాడు. ఇతడు 1924 మరియు 1928 సంవత్సరాల మధ్య 5 ఒలింపిక్ స్వర్ణ పతకాలను గెలుచుకుని 24 ప్రపంచ రికార్డులను స్థాపించాడు 'టార్జాన్'గా నటించి ప్రసిద్ధి పొందాడు

* * *

ఎమిల్ జాటోపెక్. జెకోస్లేవియాకు చెందిన మిడిల్ మరియు లాంగ్ డిస్టెన్స్ రన్నర్ ఇతడు 18 ప్రపంచ రికార్డులను స్థాపించాడు ఇతడు గెలుచుకున్న 4 ఒలింపిక్ టైటిల్స్‌లో 5,000 మీటర్ల ట్రెబిల్, 10,000 మీటర్ల రికార్డు, 1952 లో మరాథాన్ ఉన్నాయి

* * *

బిల్లీ జీన్‌కింగ్ అమెరికా దేశపు సుప్రసిద్ధ టెన్నిస్ ఆటగత్తె. 6 సార్లు వింబుల్‌డన్ ఛాంపియన్ పదవిని పొందింది ఒక్క సంవత్సరంలో 1,00,000 డాలర్లు గెలుచుకున్న మొట్టమొదటి క్రీడాకారిణి.

మైఖేలేంజిలో (1475-1564) ఇటలీదేశపు గొప్ప శిల్పి మరియు చిత్రకారుడు ఇతడి చిత్రం 'లాస్ట్ జడ్జిమెంట్', రోము ఇటలీలో సిస్టైన్ చర్చి పైకప్పుమీద వేసిన చిత్రం చాలా ప్రసిద్ధి పొందాయి సిస్టైన్ చర్చి పైకప్పు మీద మానవుని సృష్టి, పెద్దవరద (great flood) మొదలైన బైబిల్ కథలు ఇతడు చిత్రించాడు రోమ్ నగరంలో సెంట్‌పీటర్స్ చర్చికి బ్రహ్మాండమైన డోము రూపకల్పన ఇతడి శిల్ప కళానైపుణ్యాన్ని చాటుతుంది

* * *

యూక్లిడ్ (330-260 బిసి) ప్రాచీన గ్రీసు దేశపు గొప్ప గణిత శాస్త్రజ్ఞుడు గణిత శాస్త్రాభ్యాసానికి ప్రాతిపదికగా ఇతడి 'ఎలిమెంట్స్ ఆఫ్ జామెట్రీ' ఇప్పటికీ ఉపయోగపడుతూంది

* * *

చార్లెస్ బాబ్బేజ్ ప్రఖ్యాత బ్రిటిష్ వైజ్ఞానిక శాస్త్రవేత్త ఇతడు మొట్టమొదట 1812లో ఆటోమాటిక్ కాలుక్యులేటింగ్ మెషీనుకి అవసరమైన వివరాలను ఉపపాదించాడు ఇతడి 'ఎనలిటికల్ ఇంజన్' (డిఫరెన్స్ ఇంజన్) 1827 లో లోగరిదమ్స్ (logarithms) పట్టికలను తయారుచేయడానికి ఉపయోగించబడింది అదే డిజిటాల్ కంప్యూటర్‌కి ప్రాతిపదిక అయింది

## ప్రపంచంలో మిక్కిలి పొడిగా ఉండే ప్రదేశము

ఈజిప్టులో అల్ ఖరీజా ప్రపంచంలో మిక్కిలి పొడిగా ఉండే ప్రదేశము. ఇక్కడ ఇంతవరకూ ఒక్క వానచినుకు కూడా పడలేదని రికార్డులవల్ల తెలుస్తూంది.

"గురువునందు శ్రద్ధ కలిగినవారికే సద్వస్తువు లభిస్తుంది"

# వైద్యరంగం

## సుఖరోగము

### నాన్సీ లీ గోహ్‌లా

సుఖరోగము అని చెప్పబడే వెనీరియల్ డిసీస్ (VD) లైంగిక సంపర్కం వల్ల ఒక వ్యక్తి నుండి మరో వ్యక్తికి సోకే అంటురోగం ముఖ్యంగా అంటురోగాలలో రెండవది సుఖ రోగము. సాధారణంగా జలుబు అతి శీఘ్రంగా అంటుకునే మొదటి రోగం. సుఖరోగానికి



తగిన చికిత్స సకాలంలో తీసుకోకపోతే ఆరోగ్యం పూర్తిగా చెడిపోయి వికలాంగులై, అంధత్వం ఏర్పడి శరీరం పూర్తిగా క్షీణించిపోయి మరణం సంభవిస్తుంది.

ఇంత భయంకరమైన అంటురోగమైనా చాలా మందికి తమకీ రోగం ఉందన్న విషయమే వారికి తెలియదు చాలామందికి తెలిసినా ఉన్నట్టు అనలు ఒప్పుకోరు

సుఖసంబంధమైన రోగాలు గొనేరియా (gonorrhea) మరియు సిఫిలిస్ (syphilis) అనేవి రెండు బాగా వ్యాప్తిలో ఉన్నాయి. సాధారణంగా లైంగిక సంపర్కం ఏర్పడిన నాలుగైదు రోజులకు పురుషులలో ఈ లక్షణాలు వృద్ధిపొందుతాయి. స్త్రీలలో పదిమందిలో ఇద్దరికి కూడా బాగా ముదిరే వరకు తమకీ రోగం ఉన్నట్టే తెలియదు. గొనేరియాకు చికిత్స పొందకపోతే కీళ్లవాపులు మరియు అంధత్వం ఏర్పడుతుంది స్త్రీలలో వంధ్యత్వం (infertility) ఏర్పడవచ్చు.

సిఫిలిస్ మిక్కిలి భయంకరమైనది, అపాయకరమైనది ఇది శరీరంలో ఏ భాగానికైనా అంటవచ్చు. దీనివల్ల గుండెరోగాలు, అంధత్వం, రక్తం మరియు లివరు సంబంధమైన రోగాలు సంభవిస్తాయి. పిచ్చి, మరణం ఏర్పడవచ్చు.

ఒక తల్లి గర్భంలో ఉన్న శిశువుకు కూడా ఇది సంక్రమించే అవకాశం ఉంది. దీనివల్ల బిడ్డలు చనిపోయి, లేక రోగంతో వికలాంగు

( 53 వ పేజీ తరువాయి)

ఘనీభవించిన అంటార్కిటికా మంచులో చిన్న చిన్న ఈగలు, ఇతర పురుగులు కనిపిస్తాయి. కానీ 22, 400 కి.మీ.ల తీరంలో సీళ్లు, పెంగ్విన్‌లు, పెట్రెల్స్ ఇతర పక్షులు, సముద్రపు జీవులు కనిపిస్తాయి.

భూమి తీరప్రదేశం వలెగాక అంటార్కిటికా 31.2 మిలియను చ.కి.మీ.ల తీర ప్రదేశంలో అపూర్వమైన జంతుజాలం ఉంటుంది.

"ఆత్మవిశ్వాసముచే ఎట్టి ఆపదలనైననూ జయింపవచ్చును."

లుగా జన్మించవచ్చు. సిఫిలిస్ ప్రథమ లక్షణం చాన్క్రీ (chancre) అనే చిన్నపుండు ఏర్పడుతుంది. దీనిద్వారా సూక్ష్మ జీవులు శరీరంలో ప్రవేశిస్తాయి. ఈ పుండు బాధ అనిపించదు. సాధారణంగా ఏ చికిత్స అవసరం లేకుండా ఒకటినుంచి ఐదు వారాలలో మానిపోతుంది. కానీ సూక్ష్మజీవులు శరీరంలో చేరిపోతాయి. తరువాత ఆరు మొదలు 12 వారాల కాలంలో గానీ ఒక్కొక్కప్పుడు ఆరు నెలల తరువాత కానీ శరీరంమీద ఎక్కడైనా దద్దురులు బయలుదేరతాయి. చాలామందిలో ఈలక్షణాలు కనిపించక పోయినా సిఫిలిస్ లోపల ఉంటుంది.

గొనేరియా సోకిన పురుషుల మూత్రంలో వచ్చని చీము కారుతుంది. మూత్రద్వారంలో మంటతోకూడిననొప్పి ఉంటుంది చాలామందికి ఇవి కూడా కనిపించక ఎటువంటి బాధ ఉండదు. గొనేరియా ఉన్న స్త్రీలలో 85 శాత నికి అసలు ఏలక్షణాలు కనిపించవు. స్త్రీలలో దీనిని కనిపెట్టడం వైద్యులకు కూడా చాలా కష్టం. కల్చర్ వల్ల కూడా రోగలక్షణాలు కనిపించవు అయినా రోగం శరీరంలో ఉంటుంది.

గొనేరియా మరియు సిఫిలిస్ రోగాలు రెంటికీ పెనిసిల్లిన్ (Pencillin) ఒక్కటే ఔషధం. రోగి సకాలంలో చికిత్స పొందాలి. ఒకసారి నివారణ కనిపించినా స్త్రీ పురుషులు ఇద్దరికీ కూడా తిరిగి తిరిగి వస్తూంటుంది.

సుఖ రోగాల ఫలితాలు మిక్కిలి భయంకరంగా ఉంటాయి. అసలు రోగంవల్ల భయంకర పరిణామం లేకపోవచ్చు సమాజంలో అమాయకత్వం వల్ల ఇటువంటి రోగాలున్న వారు పరాభవం, నింద, నిష్ఠూరం, అపకీర్తితో మరణిస్తున్నారు.

●

## సారస్ కొంగ



SARUS CRANE

గంభీరంగా మానవుని అంత ఎత్తుగా ఉండే భారతదేశపు 'సారస్' కొంగజాతి ఈనాడు అంతరించి పోతున్న భయంకర పరిస్థితిలో ఉంది. బూడిదరంగులో రాబందు అంత పెద్దదిగా, ఎరుపు రంగుతల, పొడుగాటి మెడ, కాళ్లుగల సారస్ కొంగలు బురద ప్రదేశాలలోను, పంటపొలాలలోను జంటలు జంటలుగా కనిపిస్తాయి.

ఇతర జాతి కొంగలవలెనె సారస్‌కూడా రెండు గ్రుడ్లను పెడతాయి. అయితే రెండు గ్రుడ్లలోను ఒకటే కొంగపిల్ల అయి, పెరిగి పెద్దదవుతుంది. కానీ ఒక్కొక్కప్పుడు చిత్తడి నేల విస్తారంగా ఉన్న ప్రదేశాలలో రెండు గ్రుడ్లు పొదగబడతాయి. అయినా సారస్ కొంగల జంట పెట్టిన ఒకే పిల్లకి ఏ అపాయం, అవాంతరం కలగకుండా ఉంటే పెద్దదిగా పెరుగుతుంది. సారస్ జాతి మందంగా వృద్ధిపొందే జాతి.

కొన్ని కొంగపిల్లలు మాత్రమే పెద్దవి అవుతాయి. చేపలు మరియు ఇతర నీటిలో నివసించే కప్పలు, ఇతర ప్రాణులవంటి ఆహారం తక్కువగా లభించడము చేత, బురద నేల తగ్గిపోవడంవల్ల, నీటి కాలుష్యం వల్ల ఈజాతి బాగావృద్ధిపొందడంలేదు.

— [illegible]

"తన ఆత్మయే పురుషునికి నిజమైన గురువు."

EDITED, PRINTED AND PUBLISHED BY K V. GOVINDA RAO
AT No 9, DESIKA ROAD, MYLAPORE, MADRAS-600 004 (INDIA)
PRINTED AT

*Desh Publications (P) Ltd. Madras-14 (Ph : 848084,*

